# నా గురించి



రామ అనడం అదృష్టమైతే రామ అనడం పాలా...మి దృష్టంలో కొట్టుమిట్టాడుతున్న నన్ను శ్రీ కృష్ణ శివ మారుతీ రూపుడైన నా స్వామి సద్గురుడు నా సర్వశ్రేయస్సైన ఆషిద్రిగా ... రామా అనిపించుతు అమదానందరసగుళికల రామ నామామృతాన్ని నా కోట పలికిస్తున్నాడు నా చేత వ్రాయిస్తున్నాడు

సద్గురు సాయిబాబా జీవిత చరిత్రలో నన్ను మేల్కొల్పి ఈ గీ భగవతాది సుకృతుల యశశ్చంద్రికల నన్ను వెలిగిస్తున్నాడు నేను అవి మనిషిగా బ్రతుకున కొండంత అండదండల ధైర్యమొసగి బ్రతికిస్తున్నాడు మహా భేష్ అనిపిస్తున్నాడు

సంస్కృతాంధ్రముల లవలేశమైన పాండిత్య మెరుగని నన్నొక పనిముట్టుగా స్వీకరించి లీలామానుష విగ్రహుడు తనలీలల్ని పలికిస్తున్నాడు భక్తజనుల హృదయ పద్మాల కందిస్తున్నాడు

ఈనాడు నేను మనిషిని నా స్వామిదాసుణ్ణి ఈ సుకృతి నా కొసంగిన జన్మకారకులైన

నా జననీ జనకులకు ఈ కృతి సుకృతిగా అంకిత మొసగుతున్నాను

నా భాగ్య భవిష్యోన్నతికై తపించే మాతులకు భక్తజన లోకోత్తముల కు అంజలు లర్పిస్తూ—నన్ను సదా ఆదరించమని ఆశీర్వదించి రక్షించమని ప్రార్థిస్తూ—

నా సాయి రామునికి నా సోదరుడు గురుదేవుడు హనుమత్ స్వామిం సదా ంకరుడనై భక్తవశంవదుడనై వెల్గు సద్గురుమూర్తి వరము కొసంగమని అర్థిస్తూ—

భవదీయ దాసానుదాసుడు

—పోరుగంటి రామకృష్ణప్రసాద్

# గీత !

కురు పాండవులకు యుద్ధం అనివార్యమైయింది భగవానుడు శ్రీ కృష్ణుని ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి ఉభయ బలాలతో ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమందు ఉభయ సేనలు యుద్ధ సన్నాహం చేస్తున్నాయి

ఆ సమయంలో అందర్నీ ఒకసారి చూడాలనుకున్నాడు అర్జునుడు తెల్లగుర్రాలు పూన్చిన దివ్యరథాన్ని శ్రీ కృష్ణుడు పార్థసారథిగా ఉభయసేనలమధ్య నిలపాడు తనవాళ్ళను ఎరిగించాడు పార్థుడు ఎంతో మహానుడు భీష్ముడు, ఆచార్య ద్రోణులు హితులు జ్ఞాతులు సోదరులు తదితరుల్ని చూడటమే తడవుగా మానవత్వం ఒక్కసారి పెల్లుబుకింది పార్థుని హృదిలో యుద్ధం చెయ్యనన్నాడు జాతివినాశనం తగదన్నాడు కులక్షయదోషం మిత్రహత్యా పాతకం వర్ణసంకరమైన ధర్మం తాను చేయలేనన్నాడు అస్త్రాలు విడిచి దాయాదులే తనను చంపినా అందుకు వెరవనన్నాడు ఎదురు తిరగనన్నాడు ఏదో చేస్తానని ప్రతిజ్ఞలు చేసిన ఏదో చేస్తాడనుకున్న ఆ ప్రవీణుడు, ఆ విధంగా చప్పబడి జావగారిపోయాడు

రక్తమాంస నిర్మిత శరీరంపై అతనికిగల మక్కువ, ధర్మ వ్యతిరేకత కార్యవిఫలత కృష్ణునికి చిరునవ్వు తెప్పించింది "అర్జునా! అన్నాడు "అభయమిస్తున్నా నన్నాడు వాసుదేవుడు యుద్ధం చేయమన్నాడు ధర్మం ప్రబోధించాడు

నరనరాల్లో తనను "నరుని గా చిత్రీకరించుకున్న నరుడైన అర్జునుణ్ణి, నారాయణుడైన దేవకీపుత్రుడు వృథావ్యథ తగదని, బాధ్యత మరువద్దని, కర్మను చేయకపోవుటయే దోషమని వివిధ తెరగుల తెల్పాడు కర్తవ్యాన్ని విస్మరించినవానిని, కాలుడుగూడ క్షమించ డన్నాడు చెప్పింది చేయటం నీ ధర్మం చేయకపోవడం నీ ఖర్మం!" అన్నాడు విశ్వరూపాన్ని చూపాడు సర్వధర్మాల్ని విశదీకరించాడు శ్రేయమైన విశ్వశ్రేయాన్ని తెలిపాడు మమతాహంకారాల్ని విస ర్జించి, నన్నూ నాలోని శక్తిని తెలుసుకో! బంధనాలుల్ని తొలగించి, బాధ్యతల్ని గుర్తుంచుకో! "విశదీకరించాడు విశ్వరూపాన్ని ధర్మాన్ని, తనను గుణశక్తి సామర్థ్యాల్ని

నరుణ్ణి నారాయణుణ్ణి కమ్మన్నాడు కాకపోతే కాలగర్భంలో కలసి, నశించి, నామరూపాలు లేకుండా పోతావన్నాడు! కృష్ణుడు

భగవంతుని ప్రతీమాట పలుకు పలుకులోని పవిత్ర కర్తవ్యతా రూప గంభీరత గ్రహించిన ధనుంజయుడు చేతులు మోడ్చి "నీ యిష్టం నీ చిత్తమొచ్చిన రీతినే ప్రవర్తించి "నేను అనే జీవిగా ధర్మాన్ని నిర్వర్తిస్తానన్నాడు, అర్జునుడు

అతడొక్కడే కాదు అర్జునుడు నరుడు మనమంతా నరులమే అర్జునులమే! పరమాత్మ డొక్కడే రూపాలు పదివేలు చర్యలు ఆద్యంతాలు లేని అగమ్య గోచర వ్యాపారాలు

అందుకే సావధానంగా మనమంతా మనలోని "అర్జు నత్వాన్ని నరరూప బలహీనతల్ని విసర్జించి విస్మరించి

ఆ భగవానుని "గీత అను నిత్యం ఆరాధించాలి, సాధనచేసి తరించాలి

అందుకే మహర్షి భగవానుడు విష్ణురూపుడు వ్యాస దేవుడు భారత మధ్యమందునిల్పిన పదునెనిమిది భాగాల "భగవద్గీత ను "గీతా భగవతి పేర తేటతెలుగులో

ఆ బాలగోపాలము అక్షరజ్ఞానులు సైతము లీలగా పాడుకొని తరించ వీలుగా ఆ పరమేశ్వరుడు గీతాచార్యుడు కృష్ణ దేవుడు పదునెనిమిది పురాణాల కర్త వ్యాస భగవానుడు, త్రేతాయుగ పునాటి కథానాయకుడు చిరంజీవిత్వమొందిన శ్రీ అంజనీపుత్రుడు కలిలోని కల్మషాదులు తొలగించి మనలను తరింపచేయవలసిన "శ్రీరామకృష్ణ శివమారుతీ స్వరూప నా సద్గురుడు శ్రీ షిర్డీనాథుని ఆశీస్సులతో ఈ పవిత్రకృతిని భక్తజన విధేయుడనై భక్తజన దివ్య మందారుల కర్పిస్తున్నా

భవదీయుడు

భక్తజన దాసానుదాసుడు

వోరుగంటి రామకృష్ణప్రసాద్

---

ఇది గీతాజ్ఞానయజ్ఞం ఈ యజ్ఞ నిర్వహణలో

సహకరించిన ప్రతి ఒక్కరికి నా ధన్యవాదాలు

# అంకితం

సృష్టి అమ్మ !

ఏలికాది బ్రహ్మపర్యంతము అమ్మ ఆదరాభిమానాల ఎల్లనడపబడుతున్నదన్న నగ్నసత్యం ప్రతి ఒక్కరికి తెలుసు అందుకె నన్ను కనిపెంచి ఈనాటి నా ఔన్నత్యాన్ని భౌతికంగా చూడలేకపోయినా "నా తల్లి సువర్చలాంబ ను కనీసం ఆ అమరలోకాలనుండైనా ఆశీర్వదించమని అర్థిస్తూ

"ఈ జీవికి దేహ జ్ఞానములనొసగి "నేను అని చెప్పుకునే "దేహ" జీవాన్ని ప్రసాదించిన దేహమొసగి కంటిరెప్పలా కాచి బ్రోచిన నా తండ్రి శ్రీ వోరుగంటి వెంకటసూర్యప్రసాదరావు గారికి నన్ను కేవలం పెంచినా నా గురించి నిరంతరం ఆలోచించే తల్లినిమించిన తల్లి మరో తల్లి శ్రీమతి అనంతలక్ష్మిప్రభావతీదేవిగార్లకు

అశ్రుతాంజలు లర్పిస్తూ నా "కృతి" కృతి ఈ

"గీతా జాగృతి"

అంకిత మొనరుస్తున్నా !!!

మహోన్నతి పొందిన

మమతానురాగబద్ధుడు

— వోరుగంటి రామకృష్ణప్రసాద్ (బాబు)

ధరణిఘనమౌ వోరుగంటి వంశజుండ రామకృష్ణుడ

సువర్చలాంబా ప్రసాదరాయి జ్యేష్ఠపుత్రుడ హనుమద్భక్తుడ

షిర్డిసాయి శిష్యవరుడ శ్రీకరుండౌ భక్తివరల

ఈశ్వరాజ్ఞగ తెలుగుచేసితి ఇందు భక్తులు పాడుకొనగ

"గీత" దివ్యజ్ఞాన వశేమున, త్రిలోకమ్ముల
కాచు చుండని

9 పరమ విద్యయనగ "గీత", బ్రహ్మరూపము, దేవి, గీత
అక్షరాత్మక నిత్య సత్య ప్రణావ సర్వము "గీత"
వినుము!

10 చిదానందుడు కృష్ణ దేవుని, ముఖమునుండి పొందె
పార్థుడు

వేదజ్ఞాన తత్వమంతయు, వేదమూర్తినుండి పొందెను!

11 నిర్మలమాత్మ శుద్ధ మనమున, గీతసర్వము జపముచేయ
లభ్యమౌను జ్ఞానమంత, పరమ పదముకూడ నొందు!

12 గీత సర్వము చదువ నేరని, వారు "గీత" సగము
చదివిన

"గోవు"దానము చేసినంత, ఫలము నొందు
"పుడమి" దేవి!

13 మూడువంతుల గీత చదువ, "గంగా" స్నాన
ఫలిత మొందు!

ఆరో భాగ పఠనమందు సోమయాగ ఫలమునొందు!

14 నిత్యమొక్క అధ్యాయమ్ము, భక్తితోడ చదువువారలు
రుద్రలోక మొంది చిరము, రుద్రగణముల కలయుందు!

15 అధ్యాయ మందున నాల్గోభాగము, చదువువారలు
"ధరా" దేవి,

శ్రేష్ఠ మానవ జన్మనొంది, "మనువు కాలవు"
సుఖము లొందు!

16 ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఐదు, ఏడు,
పదియుగాక,
అర్ధ శ్లోకము చదివినంత, చంద్రలోక మొందు సత్యము!
17 మరణమొందు తరుణమందు, "గీత" పఠనము
సల్పు నరుడు
ఉత్తమంబౌ మనుజ జన్మపొందు ధారుణి పుణ్యమొంది
18 మరల జన్మ మొంది నరుడు, మరల "గీతా"పఠనసలుప
ఉత్తమంబౌ మోక్షమొందు, "గీత-గీత"నముక్తినొందు
19 మహాపాపము చేసి కూడ, "గీత" వినగాసక్తుడవగ
విష్ణుదేవుని చెంత నిలుచు, విష్ణునిలయము చేరునతడు!
20 నిత్య గీత స్మరణ చేయుచు, వివిధకర్మల మ న్గయుండు!
మనుజ వర్యుడు వీడ దేహము, జీవన్ముక్తుడు
శ్రేష్ఠ వరుడు!
21 ధరను "గీత" నాశ్రయించి, జనకుడాది రాజచంద్రులు
వీడిపాపము చనరి పుణ్య, పథ మునందు "పుడమి"వినుము
22 నుంత"గీత"పఠన చేసియు,మహాత్మ్యమ్ము విడచునరుని
జపము నంతయు నిష్ఫల మ్మగు ఫలితమందని శ్రమయే!
ధారుణి!
23 ఇట్టి గీతా మహాత్మ్యమ్ము, "గీత"తోడ జపముచేయ
సుఖము నొందు ముక్తినొందు, సర్వశ్రేష్ఠ పదమునందు
24 అనుచు తెల్పగ యాతవర్యుడు, శౌనకాది ఋషులకెల్ల
అట్టి దానిని తెల్గుజసే, రామకృష్ణుండిలను భక్తి!

౧౦

# గీతా ప్రార్థన

1 మహాభారత "సుధా" సర్వము
మహావిష్ణుమోహంబు నందున
"గీత" యనెడు దివ్యగంగగ నల్ల గ్రోలని జన్మమేల!

2 ఉపనిషత్తుల "గోవు" చేసి కృష్ణదేవుడు పాలుపితుకు
అర్జునుండు "దూడ" ఆయె "గీత" యను పాలను త్రాగమిచ్చె
అట్టి గీతా పాలు గ్రోలెడు, మనుజవర్యులు ధన్యులిలను
జన్మమన్నది కానబోరు, "గీత" గ్రోలుటే ధన్యమిలను

3, సర్వశాస్త్రము లనగ "గీత" సర్వ దేవం బనగ
"విష్ణువు"
సర్వ తీర్థంబనగ "గంగ" సర్వ వేదుండనగ 'మనువు"

4 "గీతా" గానము చేయ మింకను అన్యశాస్త్రము
లేల యికను
విష్ణుదేవుని మోహము తెలుపు, మోక్ష మొసగే
శిక్ష "గీత"

5 నూరు గీతా కృతుల నెవరు, ధనదానము చేయగలరో
వారు బ్రహ్మ పథంబు నొందెదు, శాశ్వతమ్మగ
నుందు రచట!

6 కొంచమైనను గీత చదువ, కొంచమైనను గంగ త్రాగ
కొంచమైనను విష్ణు స్మరణ, చేయ వానిని
చేర డెముడు!

7 సంసార సాగర మీాద ధరను, గీతయనెడు నావకొనుము
విష్ణుదేవుని చరణ సన్నిధి! నొసగుదివ్య బాట "గీత"
8 వ్యాసుడంటే ఎవరో యనక, విష్ణుమూర్తియె
వ్యాస దేవుడు!
9 మహాభారత మధ్యనున్న, దియు నెంమిది భాగ గీత,
నొసగ మనకు విడచింరె, ఎంత ఘణ్య వ్యాసుడంరె
10 నిత్యమిలను కీర్తింరనము, ఒకొక్కభాగ సుప్పువారలు
హీనపక్షము చదువ వలెను శ్లోకల్ పదియైనసత్యము
"గీత మహిమ" తోడ పఠనము, సలుపుటెంతో
శ్రేష్ఠమయ్యా!

# 1 అర్జున విషాదయోగము

1 ధర్మక్షేత్రము కురుక్షేత్రము, వీరులందరి తోడనుండ
నాదుసుతులు పాండుపుత్రులు, ఎటులనుంటిరో తెల్పు
సంజయా!
2 మనుపె యొసగిన వ్యాసశక్తిన, సంజయుండు యుద్ధ
కథనము
చెప్పసాగెను వింతలింకర, కురుశ్రేష్ఠునకు మోహమొంద!
2 పాండుపుత్రుల వ్యూహచతురత గాంచి అడిగెను ద్రోణ
దేవుని
నీదుపుత్రుడు సార్వభౌముడు "రా-రాజు!" యనెడు
నామధేయుడు

3 బుద్ధిమంతుడు నీదుశిష్యుడు, ద్రుపద రాజసుతుని తోడ,
పన్నినట్టి సేనచూడుడు, వాటి వివరణ చేసెదిపుడు!
4 వీరవర్యులు విల్లుకాండ్రు, మేటియనగ పొంగిపోయెడు
ధీర భీమ, అర్జునాదులతోడ నిలచిరి శూరవర్యులు
5 యుయుధాన విరట ద్రుపద, యుద్ధరంగపు శ్రేష్ఠ
మూర్తులు
యుధామన్యుడాది ప్రముఖులు, కదనరంగ శ్రేష్ఠ
వర్యులు
6 వీరవర్యుండుత్తమౌజుడు, అభిమన్యుడాది ద్రుపద
పుత్రిక
సుతులు శూరులు మహారథులు, మనతో తలపడు
తరుణమందున
7 "మహామహులే మీరు స్వామి!" ఐన మనము శక్తి
తెలిపెద!
మనలు వారలు శ్రేష్ఠవర్యులు, మనకు కలరు
"ద్రోణ" దేవ!
8 తమరు, "భీష్మ" తాతపాదులు, వీరకర్ణకృపాచార్యులు
అశ్వత్థామ సోమదత్తుడు, వికర్ణాది ధీరవర్యులు
9 వేలకొలదీ వీరవర్యులు, ధీరశూరులు ప్రాణమొసగి
స్వామిసేవల స్వర్గమొంద, నిలచినారు మనతో
స్వామి!
10 భీష్మదేవుల సేనచూడగ, మనసేనల శక్తిముందర
హీనమనగ వెలితి నొసగుచు నుంత కనబడుచుండె
స్వామి!

దివ్యశంఖారావము చేసిరి దిక్కులన్ని బెదరురీతి
క్కలలము చూప శిబులు, వినగ భీకరశంఖ గర్జన!
19 భూమిభయమున దద్దరిల్లెను దివ్యశంఖా ఘోషవినగ
కౌరవాదుల హృదయలు పగిలె, వింతభీతి సుంత కలిగె!
20 ధార్తరాష్ట్రులవాయుగాంచన, కపిధ్వజుడు నారికూర్చెడు
తరుణమందున కృష్ణదేవుని, కోరె కొక్కకోర్కె
ప్రియముగ
21 "కృష్ణదేవా! ఉభయసేనల మధ్య నిలుపుము మనదు
రధమును
ఒక్కసారి చూడగోరితి వీరవర్యుల, ధార్తరాష్ట్రుల!
22 యుద్ధరంగమునందు నేను విజృంభింపబోవు తరిన
చూడగోరితి వారలందరి, వరవర్యులతోడ కృష్ణా!
23 దుర్యోధనాది దుష్టమూర్తుల సభను గోరెడు వీర
వర్యుల
చూచెదయ్యా నేను కృష్ణా! యుద్ధవేళన క్రుద్ధులవగ!
24 కుంతి పుత్రుని కాంక్ష నెరిగిన కృష్ణదేవుడు రధము
క్షణమున
ఉభయసేనల మధ్య నిలిపె చూపుచు రగ శత్రుసేనల!
25 "చూడు మర్జున! ఇచ్చటను గల, కౌరవాదుల చెంత
నిల్చిన
రాజచంద్రుల, శ్రీమమూర్తుల యుద్ధరంగప్రవీణ
వర్యుల!
26 తండ్రితాతల హితులగురుపుత్రుల, మేనమామల అన్న
దమ్ముల

సుతుల మనుమల చూచెనొందికో, అర్జునుండు యుద్ధ
భూమిన!

27 మిత్రవర్యుల బంధుజనుల, మా మలందరి నచటగాంచిన
అర్జునుండు ఒక్కక్షణము, అటులె నిలచి యిటుల
పలికె!

28 మిగుల ప్రేమకరుణాపయలు, వెల్లివిరియు గళముతోడ
శత్రుసేనగనున్న తనదు, వారలందరి నచటగాంచి
29 కనులు యదిరెను కింరమదిరెను, దేహమంతయు
చచ్చు పడియెను
వణుకుచున్నది గాంచి వారల, ధైర్యమున్నదిలేక దేహము
30 శత్రు గుండెల ఎండిచేయు, నాదు గాండివము నేడు
చేతినుండి జారుతున్నది, మరియు స్వస్థత తప్పుతున్నది!
31 దుష్ట శకునము లెన్నో ఇపుడు, కను సన్ పెడురీతికనబడె
ఏలనయ్యా యుద్ధమిపుడు "కేశవా!" నా మాటవినుము
32 రాజ్యమొద్దు నాకు విజయ మసలేవలదు వాసుదేవ
రాజ్యభోగము లేమి సుఖము నొసగు మాకు
యాదవేంద్రా!
33 ఏగి మొసగే సౌఖ్యమొసగె, వీరవర్యులు వీడిసర్వము
ప్రాణమొసగ నిలచినారు, ఏమి సుఖము? ఏలభోగము?
34 తాత తండ్రులు హితులు గురువులు మేనమామా
మామ మరిదు
మనుమ రయ్యో భ విసకూల ఏలనయ్యా భోగమిం?

35 మాధవా! మధుసూధనా! ప్రభు! మూడు లోకము
లొసగ నాకు
చంపనయ్యా! వీలడని చంపనయ్యా నేను చంప!

36 ధార్తరాష్ట్రుల చంప మాకు, వినుము కృష్ణా
ఏమి ఫలము?
మమ్ము చంపెడు వారి నసలు, చంపు టన్నదే
గొప్ప పాపము?

37 బంధనాదులు త్రెంచు వారల, బంధుజనులు
యనుచు మరచి
చంపి నంతనే సుఖము కలుగా! ఏటి కయ్యా
అట్టి సుఖము?

38 కులక్షయము చేయ దోషము, మిత్ర ద్రోహము పాత
కమ్ము
లోభ బుద్ధిన వారు దీనిని, విడచ పుచ్చిన వీడనిమ్ము!

39 "కులక్షయము" యనెడు దోషము, తెలిసి కూడ
చేయ పాపము
నాకు మనము యొప్పకున్నది, తెలిసి చేయుట వినుము
నేను

40 కులక్షయము చేయునపుడు, సనాతనమౌ ధర్మమంత
అంతరించును భ్రష్ట మగును, చూడ ధర్మము
హృదిన సుంత!

41 ధర్మమార్గము వీడినట్టి, స్త్రీలు "మాధవ!"
చూడవయ్యా!
వీడి ధర్మము కులము సర్వము, వర్ణసంకర లౌదురయ్యా?

42 సంకరంబున నరకమొంది నాశకులు కులము యంత
పితృదేవతరులు పిండతర్పణ, క్రియలు లేక పతన
మౌదురు!

43 వర్ణసంకర హీనజాతులు, కులము ధర్మము పాపమనుచు
భక్తి ఎరుగక జాతి మొత్తము నాశనమ్ము చేతురయ్యా!
44 కులము ధర్మము సంకరమ్ము చేయువారలు నరక
మందున
పెక్కు కాలము యుందురనుచు, వింటినయ్యా
నేను కృష్ణా!
45 రాజ్యకారణమయ్యొ కృష్ణా! బంధుజనుల చంపు
పాపము
హీనమనగ మమ్మపట్టి, పాపకూపమునందు త్రోయు!
46 ధార్తరాష్ట్రుల హద్దు మీరి, చంపనిమ్ము మమ్ము
కృష్ణా!
ఆయుధమ్మును నేను పట్టు, అదియే నాకు మంచిదయ్యా
47 అర్జునుండు పలికినావిధి, అస్త్రరాజము లన్ని విడిచి
వాసుదేవుని రథమునందు, ఖేదమొందుచు కూల బడియె!

○ ○ ○

వ్యాసశక్తిన సంజయుండు పలికినట్టి కథనమందున
"అర్జున! విషాదయోగము" రామకృష్ణుడు తెనుగుచేసె!!

# 2 సాంఖ్యయోగము

1 కృంగిపోయిన పాండుసుతునీ, అశ్రుణాలు భయము
చూచి
కృష్ణదేవుడు పలికెనిటుల, ధైర్యమెంతో కూడ బలుక!
2 సజ్జనాదులు యొప్పనట్టి స్వర్గధామము దొరుకనట్టి
కీర్తినీయని కల్మషమ్మౌ భావమెటుల పొందినావు!
3 పౌరుషమ్మను పొందు మర్జున, నపుంసకుండవు
కాకనీవు
శత్రురాజుల హతము చేసెడు ధైర్యమొందుము
వేగమిపుడు!
4 పూజనలిపెడు భీష్మదేవుని, ద్రోణుడాది గురువు హితుల
ఎదుట నిలచి పోరుటెటులు? యనుచు అడుగ సాగె
పార్థుడు!
5 విద్యగలిగిన నొజ్జచంపి నెత్తురోడే సిరులు కోరే
భోగభాగ్యములేల కృష్ణా! బిచ్చమెత్తే సుఖము చాలు!
6 మంచిచెడుల భేదమెరుగక, జయము మాటయు జాడ
నెరుగక
ధార్తరాష్ట్రుల చంపి భోగము, లొందమనెనము
మమ్ము వీడా?
7 లోభదృష్టిన మందబుద్ధిన, ధర్మమార్గము మరువచిత్తము
శరణుపొందితి కోరిధర్మము, కృష్ణ! దేవా!
కరుణ పూనుము

8 క్రుంగ దీసెను శోకమందున, శత్రురహిత రాజ్యమైనా
ఇంద్ర పదవి సైతమొంది, సుఖమ్మియన్నది పొందలేను
9 పార్థు డావిధి పలుమ పురుషున్, చెంతనిలచి దిగులుచెంద
నవ్వుచూ నీరీతి పలికే, నవ్వు మువ్వోడు నవ్వురేను
10 ఏడ్వకూడని వాటికొచ్చి, ఏడ్చుటెంతో పాపమయ్యా!
బుద్ధిమంతులు చావుబ్రాచ్చి, ఏడ్వరయ్యా ఎప్పుడుకూడ!
11 గతము నేను నీవు కూడ రాజులందరు కలరు లేరా!
వుందుమయ్యా ముందుకూడ! వుండమని నేననుటలేదు
12 దేహమయ్యో పోయినంత ఆత్మ నిత్యము సత్యమయ్యా
అనుచుపలికెను కృష్ణదేవుడు అర్జునుండు ధైర్యమొంద
13 దేహమందున ఆత్మనిలిచ బాల్యయౌవ్వన ముసలితనము
ఎటుల పొందునో అటులె మరల దేహమొందుట
జ్ఞాని తెలియు
14 చలియు వేడి సుఖము దుఖము చల్లగా నను చేరుచుండు
అనిత్య ద్వందము లవియె పార్థా! ఆదరింపక నూరడిల్లుము
15 పురుషశ్రేష్ఠుడ! సుఖము దుఖము, బాధనొందని ధీర
పర్యుడ!
మోక్షమొందెను యోగ్యుడనగ, తెలుపుచుంటిని
వినుము పార్థా!
16 సత్తుకలదు, "లేదు" అనకుము, ఆత్మకలదు ఏది
యనకుము?
తత్వపరులా సత్వచింతన, చూచినారు చోద్యమనకు!
17 నాశమనగ లేని శక్తి, నిండియున్నది సృష్టియంత
సృష్టిచేసెడు శక్తినెవడు, నాశనమ్ము చేయలేడు!

18 నిత్యసత్యుడు దేహాయకుచు, నాశమెరుగని స్వాను
భవముల
తెలియరాని వునికి చూడు, ఆత్మకెన్నో గృహములనుచు
సత్యమెప్పుడో తెల్పినాడు, యుద్ధమిపుడే చేయుమయ్యా!
19 ఆత్మచంపుట చెల్లదయ్యా ఆత్మచావదు కిత్తికయ్యా!
శస్త్రమైనా, అస్త్రమైనా, ఆత్మనుంచని సోహమయ్యా!
ఆత్మ తెలియని మూర్ఖుడెవడో చంపునానను భావమొంద
తెలుపు మాటల వీడిపవు, జ్ఞానమొందీ యుండు
నమువుము!
20 పుట్టడయ్యా ఈతడెపుడు, పుట్టుటనెడి మాట ఎఱుగడు
గతమునుండి ఇపుడు లేడను, భావమిచట పనికిరాదు
పుట్టుటుంటే గిట్టుటయ్యా పుట్టనపుడు గిట్టడెపుడు
జననమరణ మెరుగనీతడు, నిత్యసత్యుడు, సత్యమెపుడు!
2 నాశమెరుగని జన్మలేని, మార్పు తెలియని వ్యక్తి నెవరు
చంపుటెటులు? చచ్చుటెటులు? చంపునానను భ్రాంతి ఏల?
22 పాతవస్త్రముల నెటుల నరుడు, విడచి పుచ్చుకో అటులె
ఆత్మ
జీర్ణదేహము విడచిపుచ్చి, క్రొత్తదేహము పొందు
టెరుగుము
23 ఆయుధమ్ములు అంటరాని, అగ్ని అసలే అంటుకోని
గాలి నీరు సోకలేని, వింత శక్తిగ ఆత్మ నెఱుగుము!
24 ట్టుబడడు, కాల్చబడడు, ఎండ వెండకు తడునడాతడు
నిత్యసత్యుడు, స్థిరపురూపుడు, జన్మమన్నది తెలియ
డాతడు!

25 ఇంద్రియములకు లొంగిపోని, వ్యూహాకందని వ్యక్తి యాతడు
విచారమెరుగని వ్యక్తి యాతడు, వివేకమొంది నడువు మందుకు

26 ఆత్మనాశన మొందుయనుచు, జననమరణము నిత్య మనుచు
భ్రాంతిపొంది శోకమొందకు, కుంతిపుత్రా! ధైర్య మొందుము!

27 పుట్టుటున్నను చావుతప్పదు, చావు వచ్చిన పుట్టు కుండును
ఆపలేనిరంధి చక్రము గూర్చి మోహము శోక మొందకు!

28 గతము ఎఱుగని స్వాగతముందుచు, జన్మ గూర్చిన రోదనేల?
ఉన్న నడుమ రేపు తెలియని నష్టగూర్చియు శోకమేల?

29 ఆశ్చర్యమొందును, చింతించును, ఏమి తెలియక కలత పడును?
తెలియలేని, తెలియలేని, ఆత్మ గూర్చిన వాద మొందుకు?

30 కుంతీపుత్ర సర్వజీవుల, చంపెననుచు తలపబోకుము
చావురాని, చావులేని, ఆత్మగూర్చియు ఖేదమొందకు!

31 నీదు ధర్మము విడవినవు, యుద్ధభూమిని విడిపాఱిన,
క్షత్రియుండవ, నీవు పార్థా! క్షాత్రము గాదు సాగు ముందుకు

32 స్వర్గద్వారము తెరచియుండు, యుద్ధమందున వీర! అర్జున!
అట్టి మరణము పొందుటన్నది, సౌఖ్యమగును క్షత్రియులకు!
33 ఇట్టి యుద్ధము చేయకున్న, నీదు ధర్మము విడచినటులే
ధర్మయుద్ధము చేయకున్న, పాపకీర్తిని పొందెదీవు!
34 నీదు క్షాత్ర మపఖ్యాతిగ, లోకులెల్లరు చెప్పుకుందురు
అంతకన్న మరణమొందుట శరణమనుచు దూకు ముందుకు!
35 కర్ణయోధులు, మహావీరులు, నీవు భీతికి నవ్విపోదురు
భీరుడనుచు వెక్కిరించ, నీకు బ్రతుకు చితికిపోదా!
36 నీదు బలము నిందనొంది, శాత్రవులకు నిలయమయిన
గతమునొందిన కీర్తిశక్తి వ్యర్థమగును వినుము పార్థా!
37 మరణమొందిన స్వర్గమొచ్చు జయము నొందిన రాజ్యమొచ్చు
కీర్తికాంతను పొందయర్జున! నిశ్చలంబుగ పోరు సల్పుము!
38 సుఖము దుఃఖము, లాభనష్టము, జయము అపజయ మనుచుతలువక
పాపమొందని పోరుసల్పుమ, నర్ధమిప్పుడు, వీర! అర్జున!
39 పాపచింతల పాఱద్రోలు సాంఖ్యమనగా నిదియే పార్థ
కర్మబంధన తొలగచేసెను, జ్ఞానశక్తిని ముందువినుము!
40 మోక్షమొందగ చేయు కర్మము, నీదుధర్మము కట్టికుడపదు

48 జ్ఞానమొందుట పొందకుండుట సమముగున్న యోగ
మగును
ఆశ్రయించుము దాని నీవు దేవదేవుని శ్రీమానసగి
సంగమొందక కర్మచేయుట, శత్రుమర్దన నీదు ధర్మము
49 భేదబుద్దిన చేయు కర్మలు ఫలిత మీయవు సాంఖ్య
మందువ
పాపహేతువు లౌచుజన్మ, నొసగు బీజము లవియెవార్ధా!
50 సమతబుద్ధిన పుణ్యవాపము వీడినీవు కర్మచేయుము
యోగమైనా ఇటులచేసిన సిద్ధికలుగును వినుము భారత!
51 కర్మ లొసగెడు ఫలము వదిలి, బుద్ధిమంతులు బంధ
మొందక
జన్మమెరుగని స్వర్గమందున, సకలభోగము లందు
కొందురు
52 మోహ, కలుషము వీడినను, బుద్ధిఎపుడు శుద్ధమగునో
విన్నదానికి, వినెడుదానికి, వేపమొందవు కుంతిపుత్రా!
53 శ్రుతులు తెల్పిన భావనమ్ములు నీదుబుద్ధిన నిండి
యున్నను
వింల్ప మొందక ఆత్మగూర్చి వివేక మొందెను
చింత చేయుము!
54 "స్థితప్రజ్ఞుం" డనగ తెలుపుము, "సమాధి" యనగ
తెలియ చేయుము!
వివరమడిగెను వాసుదేవుని, కరము మోడ్చి కుంతి
పుత్రుడు!

55 కామ్యమొందక దేవదేవుని, మదిన చూచెను వాడు మహిన
స్థితప్రజ్ఞుండనగ తెలియుము, అనుచు చెప్పసాగె కృష్ణుడు!
56 సుఖము దుఃఖము భయము రాగము, క్రోధమెరుగని వాడేమునుడు
స్థిత ప్రజ్ఞుండాతడనగ, మౌనియనగా చెల్లు భారత!
57 శుభాశుభముల చింతలేక, దేహమందున భ్రాంతి నొందక
జీవించు మౌనియే మునుడు భువిన, వివేకమచట స్థిరము గుండును
58 కూర్మవాంగి యింద్రియాదుల విషయవాసన లొందకుండ
ఇంద్రియంబుల నుండికూర, మౌను బ్రతికెడు జీవి ధన్యుడు!
59 విషయ మెరుగని జీవికెన్నడు, ఇంద్రియాదుల వాసనుండదు
బ్రహ్మమందున నిలచి యాగెడు, పరబ్రహ్మము నొందు పార్థ
60 బుద్ధిమంతుడు నైనకూడ, ఇంద్రియంబులు దేహియొక్క
మనసు పట్టిలాగుచుండె, విషయవాసన లవియె పార్థ
61 ఇంద్రియంబుల చిక్కబట్టి, విషయవాసన లదిమిపట్టి
పరబ్రహ్మము "నేనే" యనెడు, వాని చెంతనే ప్రజ్ఞ నిలచును!

62 విషయమందున నిల్చువానికి కోర్కెలెన్నొ
పెరుగు పార్థ!
కోర్కె తీరకున్న కోపము, పెరుగునయ్యా కాంక్ష తోడ!
63 క్రోధమూలన తొలగి జ్ఞానం, స్మృతియు కూడ
భ్రంశమొందు
కార్యకారణ జ్ఞానమెరుగని వాటి వలన నావి తొలగును!
64 రాగద్వేషము వీడిజీవి, అన్నవాన లక్ష విడచి
ఇంద్రియంబుల నదిమిపెట్టి కార్య మొంపును,
సార్థ్యమొందును!
65 నిర్మలాత్మను దుఖమెంతయు చెందోదు తెలియు
మర్జున
ఆత్మ రూపుండాతడు, దుఖమంతయు విడచి
బ్రతుకు!
66 ఆత్మకట్టడి లేనివానికి, ఆత్మజ్ఞానము అసలు అంటదు
అట్టివానికి భావనెక్కడ? శాంతి ఎక్కడ? సుఖము
ఎక్కడ?
67 విషయవాసన పైకిలాగ, ఇంద్రియంబులు మనసు నొత్తు
వివేకవంతుని చింతలన్నియు, గాలితాకిడ ఓడయాను!
68 కనుక అర్జున! ఇంద్రియాదుల విషయవాసన లందు
నిలుపక
చూచు వాడే ధన్యుడిలను, పుడమియందున పురుష
శ్రేష్ఠుడు
69 రాత్రియందున మేలుకొనుచు, పగటిపూటన
నిదుర నొందు

జ్ఞానియాతడు పుడమినందు, మౌనియతడు విను ౹
పార్థా!

70 సంద్రమందున జలములెన్నో, చేరి స్థిరముగ
నిలిచి యుండు

అటులే కోర్కెల మదిన దాచి, శాంతి గాంచెను
వాడే ధన్యుడు

71 కామ్య మెరుగక, కాంక్ష గొనక,
అహంకారము అసలు లేక

నాది నేనను భేదమెరుగని, వాడే శాంతి నొందు ధన్యుడు
72 ఇట్టి స్థితిన పరబ్రహ్మము, నిల్చియుండు ముక్తినొసగు
అంత్యమందుననైన పార్థా బ్రహ్మనార్చి చింతచేయ

o o o

అనుచు చెప్పెను సంజయుండు, పార్థకృష్ణుల వాదమంత
వ్యాసమౌని గొసగు శక్తిన, వినగ వేగిర
మొందు విభునకు!

అట్టి సాంఖ్య యోగమంతయు, రామకృష్ణుడు
తెనుగు చేసె

తేట తెనుగున పాడుకొనగ, పుడమి భక్తులు
మోద మొందు!

o o o

# 3 కర్మ యోగము

1 కర్మయోగము కన్న బుద్ధి గొప్పదనుచు కృష్ణ నీవు
కర్మ మందున మరల నిలుపు, మనుచు ఏల పలుకుచుంటివి
2 రెండు విధముల నున్నవయ్యా నీదు మాటలు
తెలియ కున్నవి
నన్ను కావగ ఒకే మార్గము, చూపు మనుచు
వేడె పార్థుడు!
3 జ్ఞాన వంతులు జ్ఞాన యోగము, కర్మ మూర్తులు
కర్మ యోగము
చేయు నిర్ణయ మెపుడో జరిగెను, నాదు చేతనే కుంతిపుత్రా
4 యజ్ఞ కర్మలు చేయనంతనే, కర్మ శూన్యుం
డవడు ఎవడు!
చేయతగిన కర్మవీడ, సిద్ధి పొందదు యనుచు కృష్ణుడు
5 కర్మ చేయక నొక క్షణము భువిన వుండగ జాలడెపుడు
ప్రకృతందలి గుణము పొంది, కర్మ చేయును
మనుజ వర్యుడు
6 కాళ్ళు చేతులు కట్టిపెట్టి విషయవాసల లందు మెలిగెడు
మూఢభక్తులు మోసగాడిగ, భువిని చెప్పబడును పార్థ
7 ఇంద్రియంబుల నిగ్రహించి, ఫలమునందు తృష్ణ లేక
కర్మ చేసెడు వాడు ఘనుడు "మిథ్యా"
వాది కన్న అర్జున

8 నిత్య కర్మను విధిగ చేయుము, చేయకుండుట
ఎంతో పాపము
కర్మ చేయని జీవి జన్మ, సార్థకంబు కాదు భారత
9 ఇతర కర్మలు ఎన్నియైనను, లోక బంధన
హేతు మూర్తులు
కను అర్జున ఫలము కోరక, యజ్ఞ కర్మము
చేయ బూనుము!
10 సృష్టి చేసెడు సమయ మందున, బ్రహ్మదేవుడు
ప్రజల నలవి
యజ్ఞ వృద్ధిన కామ్య మొంది, యిష్ట సుఖ ల
నొంద కోరె
11 యజ్ఞకర్మల చేత దివ్యుల గారవించి కామ్య మొందుడు
యజ్ఞ కర్మకు తృప్తి నొందిన దేవతాదులు మిమ్మ కాచు
12 యజ్ఞమందున తృప్తి నొంది, కామ్యమొసగిన
దేవతాదుల
తిరిగి తృప్తిపరుచ కొల్లని, వారు ధూర్తులు
ధర్మ సోదరు!
13 యజ్ఞ శేషము నొంది ప్రతి అనుభవించెడి
వారు పుణ్యులు
దేవతాదుల విడిచి తమకై సుఖము
లొందెడు వారు పాపులు
14 అన్నమందున జీవి జననం, మేఘ మందున
అన్న జననము
యజ్ఞమందున మేఘజననము కర్మవలనన యజ్ఞజననము

15 కర్మ జననము వే మందున, వేద జననము
బ్రహ్మ మందున
వేది సర్వము యజ్ఞమందున,
బ్రహ్మ రూపగ నిలచి యున్నది!
16 ఇట్టి జగత్ చక్రరాజము, వీడి నడిచెడు వాడు పాపగ
ధూర్తుడౌచు వ్యర్థ జీవిగ బ్రతుకు చుండుట
పార్థ! గాంచుము
17 ఆత్మయందే నిలిచి వెలుగు ఆత్మయందే తృప్తినొందు
ఆత్మయందే తుష్టి నొందు వ్యక్తి పొందెడు కర్మలేదు
18 అట్టివాడి లోకమందున చేయవలెగిన కర్మలేదు
కర్మచేసిన, చేయకుండిన హానియన్నది యెరుగడాతడు
19 కనుక ఫల మును విడినీవు కర్మచేయుము పురుష శ్రేష్ఠా
"ఈశ్వరార్పణ" యనుచు చేసెడు కర్మ యందునే
ముక్తి కలదు!
20 జనక భూపతి మొదలు జ్ఞానులు కర్మ చేతనే
ముక్తినొందిరి
"కర్మచేయుట లోకక్షేమము" అనుచు కర్మను
నీవు చేయుము
21 శ్రేష్ఠపురుషులు చేయు కర్మను, లోకులందరు ఆచరింతురు
రాజు ఎటుల వర్తించునటుల పౌరులుందురు పార్థ వినుము
22 మూడు లోకములందు నేను చేయదగిన కర్మలేదు
ఐన నేను చేయుచుంటి, కర్మ "సంధి" చక్ర మొందె
23 నేను కర్మను ఆచరించి, చేయ ప్రజలు నన్నుచూసి
అనుసరింతురు గాదె పథము, కర్మ మార్గప్రవర్తి నేనుగ

15 కర్మ జననము వే మందున, వేద జననము
బ్రహ్మ మందు౯
వేద సర్వము యజ్ఞమందున,
బ్రహ్మ యూపగ నిలచి యున్నది!
16 ఇట్టి జగత్ చక్రరాజము, వీడి నడిచెడు వాడు పాపగ
ధూర్తుడౌచు వ్యర్థ జీవిగ బ్రతుకు చుండుట
పార్థ! గాంచుము
17 ఆత్మయందే నిలిచి వెలుగు ఆత్మయందే తృప్తినొందు
ఆత్మయందే తుష్టి నొందు వ్యక్తి పొందెడు కర్మలేదు
18 అట్టివాడి లోకమందున చేయవలెన కర్మలేదు
కర్మచేసిన, చేయకుండిన హానియన్నది యెరుగడాతడు
19 కనుక ఫలమును విడినీవు కర్మచేయుము పురుష శ్రేష్ఠా
"ఈశ్వరార్పణ" యనుచు చేసెడు కర్మ యందునే
ముక్తి కలదు!
20 జనక భూపతి మొదలు జ్ఞానులు కర్మ చేతనే
ముక్తినొందిరి
"కర్మచేయుట లోకక్షేమము" అనుచు కర్మను
నీవు చేయుము
21 శ్రేష్ఠవర్యులు చేయు కర్మను, లోకులందరు ఆచరింతురు
రాజు యెటుల వుండో నటుల పౌరులుందురు పార్థ వినుము
22 మూడు లోకములందు నేను చేయదగిన కర్మలేమి
ఐన నేను చేయుచుంటిని, కర్మ "సంధి" చక్ర మొందె
23 నేను కర్మను ఆలసించి, చేయ ప్రజలు నన్నుచూసి
అనుసరింతురు గాద పథము, కర్మ మార్గప్రవర్త నేనుగ

వారు కర్మ బంధ మెరుగక, సుఖము కొందట
జగతి యెరుగు
32 నాయి మతమున ననుకొంది, కర్మ సలుపని
బుద్ధి హీనులు
నష్ట రూపులు, భ్రష్ట మూర్తులు, నాశ మొందెడి
జ్ఞాన హీనులు!
33 జన్మ జన్మల కర్మ ధర్మము వీడి నడచుట జ్ఞానికైనను
వీలు పడదు వినుము పార్థా, దేహధారుల గతియెఅంత
34 ఇంద్రియంబులు విషయవాసన,
రాగ ద్వేషము లనక నీవు
వీడి వాటిని నడువు మనుకు జ్ఞానికివియెశత్రులిలను
35 హీన మైనను నీదు ధర్మము, శ్రేష్ఠ మనుచు
చేయు మర్జున,
గొప్పదైనను పరుల ధర్మము, నరకమనుచు వీడుపార్థా!
36 తనకు తెలియని కొన్నిపనుల, విలుచేయునో మనుషి
భువిన
అటులచేయు శక్తి ఏమి? తెలియచేయుము కృష్ణ నీవు!!
37 రజోగుణపు రూపుకామము, కోర్కె తీరక క్రోధమౌను
తనివితీరని పాపరూపపు, కామమిక్కడ శత్రువైనది
38 పొగనగప్పిన నిప్పుయనగ, మకలినిండిన యద్దమనగ!
మావి నిండిన గర్భమనగ, కామమందున జ్ఞానముండె!
9 నిత్యశత్రువు జ్ఞానికనగ, దుర్లభమౌ మోక్షసాధననగా
తృప్తి తెలియని కామమందున, జ్ఞానమున్నది
వినుము పార్థ!

40 ఇంద్రియాములు మనసుబుద్ధి, కామదేవత కేంద్రమాచు
జ్ఞానదేవత కళ్ళుగప్ప మోహామూర్తిగ నిలిపె జీవిని!
41 ఇంద్రియాదుల నదిమిపెట్టి దుష్టకాముని వీడి ఆత్మ
ఎఱుగగురువునైన శాస్త్రము, స్వీకరించెడు శ్రద్ధ నొందుము
42 ఇంద్రియంబులు గొప్పవనగా, వానికంటె మనసు గొప్పది
మనసుకన్నా బుద్ధిగొప్పది, బుద్ధికన్నా ఆత్మగొప్పది!
43 "బుద్ధి కన్నా ఆత్మగొప్పది" యనెడు, ఆత్మారాము నెఱుగ
ఆత్మనాత్మనే సంగపరచి, దుష్టకామును వీడినడువుము

○ ○ ○

"కర్మయోగి" మనెడు దీనిని సంజయుండు తెలుప విభునకు
రామకృష్ణుడు తెనుగుచేసె, సకలబుధులు చదువుకొనగ

# 4 జ్ఞానయోగము

1 శాశ్వతమ్మగు జ్ఞానయోగము, మున్ను సూర్యుకు చెప్పయుంట
సూర్యుడేమో చెప్పమనువుకు, ఇక్ష్వాకుడొందెను మనువువద్ద

2 సాంప్రదాయ రీతియోగము రాజ ఋషులు తెల్సు
కొనిరి
నేటియుగమున నాశమొందెననుచు చెప్పినాగే కృష్ణుడు!
3 అట్టియోగం బిపుడు నీకు, భక్తుడనగ మిత్రుడనగ
చెప్పుచుంటిని వినుము పార్థా శ్రేష్ఠధర్మంబనెదు దీనిని!
4 నీదు జన్మమిప్పుడు కృష్ణా, సూర్యుడెమో ఎపుడో పుట్టె
అట్టి విద్యను నీవు సూర్యుని కెట్లుగల తెల్పితివనగ
పార్థుడు
5 నీకు నాకు వేలజన్మలు జరిగిపోయెను కుంతిపుత్రా
అట్టి జన్మలు నాకు తెలియు నీవు తెలియనేరవయ్యా!
6 సర్వబ్రహ్మము నావరించెదు, నాకు పట్టుక లేదు
వినుము
మాయయందే పుట్టి నేను, మాయయందేలయను
నొందెద!
7 ధర్మనిరతికి హానికల్గిన పుట్టుచుందును నాకు నేను
అధర్మచింతన పారద్రోలి, ధర్మరూపిగ నిలతు శాంతి!
8 సాధుమూర్తుల రక్షచేయ, దుష్టబుద్ధుల శిక్షచూడ
అవతరింతును అవనియందు, యుగయుగంబుల
ధర్మరూపిగ
9 నాదురూపము, నాదుజన్మము, సాధురక్షణ కర్మ
యోగము
తెలుసుకొనిన వాని కవనిన, జన్మమున్నది లేదు పార్థ!
10 క్రోధరాగ భయములన్ని వదలవేసి బ్రహ్మవేత్తలు
జ్ఞానమొందీ ముక్తిధామము పొందినారు నాదుసేవల

11 ఎట్టి ఫల ముపొంద నన్ను సేవచేతురో యట్టిఫలము
ఇత్తునయ్యా నాదుమార్గ ము అనుసరించేదు
పుణ్యజనులకు

12 కర్మఫలము నొంద మనుజులు దేవతాదుల సేవచేసి
శీఘ్రముగతిన ఇష్టసిద్ధి, ఇలను పొందుచునుంటి ర్జున!

13 గుణముబట్టి వర్ణమనుచు, నాల్గువిధ ముల సృష్టిచేసితి
మాయలోబడనుండు నన్ను, మహామాయగ తెలుసు
కొనుము

14 కర్మలంటని, ఫల ముకోరని నన్ను తెలుసుకొనెదు
వారలు
కర్మబంధము లంటబోని, మహాజ్ఞానిగ భువిన వెలుగు

15 ఇట్టి కర్మలేచేసి భువిన, ముక్తి గొందిరి నీదు పూర్వులు
అటులే నీవు కర్మచేయుచు, నీదు పూర్వుల దారి
నడువుము

16 అకర్మ, కర్మ తెలియకెంవరో, బుద్ధిమంతులు కలత
చెందిరి
అట్టి దానిని గూర్చి చెప్పెద, అప్రమత్తుడ వౌచు
వినుమా!

17 చేయదగిన కర్మవివరము, విడువదగ్గ కర్మవిషయము
ఊరకుండెడు కర్మవిషయ ం, కర్మతత్వము తెలియ
కష్టము

8 దేహయాత్రాకర్మయందు లీనమవక కర్మచేయుచు
కర్మయందున చిక్కుపడక, కర్మచేయకు వాడు మునుడు

19 సర్వకర్మల కోర్కెలన్ని సంకల్పమొందక విడచువాడు

జ్ఞానాగ్నియందున కర్మలన్ని దగ్ధపరిచెను బుద్ధిమంతుడు
20 కర్మఫలము కోరకుండా, కామ్యమెరుగని నిత్యతృప్తుడు
కర్మయందున నిలచి కూడ, కర్మచేసియు, చేయనటులే!
21 చిత్తమందున చింతలే , కామ్యమందున కాంక్షలేక
దేహమందున భ్రాంతిలేక, కర్మచేసియు పాపమొందడు!
22 ద్వంద్వమెరుగడు, ఈసుపొందడు, సమత బుద్ధిన సిద్ధ
పురుషుడు
దొరికినంతనే తృప్తి పొందెడు బంధమెరుగని బుద్ధి
మంతుడు
23 నిరాసక్తుడు జ్ఞానవంతుడు ముక్తికోరెడు ధీవిత్తుడు
యజ్ఞకర్మలు చేయువాని, సర్వకర్మలు నాశమగును
24 హవిసు బ్రహ్మము, అగ్ని బ్రహ్మము సర్వఅర్పణ
హుతము బ్రహ్మము
సకల కర్మము బ్రహ్మమైన, బ్రహ్మకర్మము బ్రహ్మమే
కదా!
25 కర్మయోగ శ్రేష్ఠవర్యులు, దేవప్రీతికి చేయు యజ్ఞము
జ్ఞానయోగులు బ్రహ్మ యగ్నిన, హుతము చేతురు
ఆత్మనాత్మనా
26 శ్రవణ మనముల నిగ్రహించి, సంయమాగ్నిన హుతము
చేతురు
అటులే శబ్దవిషయములను కొందరగ్నిన మాడ్చివేతురు
27 “ఆత్మనిగ్రహ” మనెడు అగ్నిన సర్వకర్మలు సర్వచేష్టలు
ఇంద్రియంబులు వాటి చేష్టలు, “జ్ఞాన” అగ్నిన
హుతము చేతురు

28 ద్రవ్యయజ్ఞము, తపోయజ్ఞము, ధ్యానయజ్ఞము యోగయజ్ఞము
వేదశాస్త్ర యజ్ఞమనుచు, బుధులు చేతురు వివిధ వ్రతములు

29 అపానమందున ప్రాణహోమము, ప్రాణమందు నపాన హోమము
ప్రాణాపానగమన గతిని, ప్రాణాయామము సల్పుచుందురు

30 నియతాహారులు ప్రాణవాయువు, దానినందే హోమము చేతురు
యజ్ఞహోమము సల్పువారలు పాపకర్మలు విడినడుతురు

31 యజ్ఞశేష ఫలము గ్రోల, సనాతనుండౌ బ్రహ్మ గూరుకును
యజ్ఞకర్మను వీడ అర్జున, ఇహము లేని పరము ఎక్కడ?

32 వివిధరీతుల యజ్ఞవిధులు, వేదముఖమున పుట్టియున్నవి
కర్మజములగ వీటినెల్ల, కాయవాచిక హృదిస ఎరుగుము

33 ద్రవ్యయజ్ఞము కంటె జ్ఞానయజ్ఞ మెంతో శ్రేష్ఠమర్జున!
బంధమొసగని కర్మలన్నీ జ్ఞానమందున నిలిచియున్నవి

34 జ్ఞానమెరిగిన తత్త్వమూర్తులు, సర్వవేళల కరుణ జూతురు
అట్టి జ్ఞానుల సేవచేసి మసలమసల జ్ఞానమొందుము

35 సృష్టియందలి విజ్ఞానము మోహభ్రాంతి కూల్చినట్టి

జ్ఞానమంతేయు పరబ్రహ్మము, బ్రహ్మమందున కలదు
పార్థా!

36 పాపరూపుండన్న పాపము, చేయువాడవు ఐనకూడా
పాపమొందవు జ్ఞానమొందిన, దాటగలవా జ్ఞానతెప్పన!

37 ప్రజ్వరిల్లెడు అగ్ని ఎట్టుల, బుగ్గిచేయునో సమిధనటుల
"జ్ఞాన" అగ్ని కర్మలన్నిట, బూదిచేయును వినుము
పార్థా!

38 జ్ఞానమంత పవిత్రమైనది లోకమందున లేదు అర్జున
కర్మ జ్ఞానయోగ ఫలముల, ఆత్మయందే పొందు
మనఘా!

39 శ్రద్ధకల్గిన బుద్ధిమంతుడు, వీడి విషయ వాసనాదుల
జ్ఞానమార్గమునందు నిల్చిన, ముక్తి శాంతుల
పొందగలడు

40 ఆత్మనెరుగని సంశయాత్ముడు, గురుని మాటలు వినని
మనుజుడు
'సుఖము యన్నది ఎరుగడిలను —"పరము" యనెడు
మాటలేల?

41 సన్యసించీ కోర్కెలన్నె యోగబుద్ధిన జ్ఞానమొందీ
ఆత్మనెరిగిన బుద్ధిమంతుని, కర్మబంధము లెన్నడంటవు!

42 కనుక అర్జున జ్ఞానశక్తిన, అజ్ఞానమంతేయు చీల్చి
వేయుము
యోగబుద్ధిన కర్మచేయుము, సమతబుద్ధిని మనుంచు
నడుపుము

○ ○ ○

అనుచు తెల్పెను "జ్ఞానయోగము" పార్ధవరునకు
కృష్ణదేవుడు
దానినెల్ల వినుతిచేయ వినెను కౌరవరాజ శ్రేష్ఠుడు
అట్టిదానిని తెల్పుచేను రామకృష్ణుడు కర్మయోగ
భక్తవరులు పొంది మెందన, భువినమిగుల శ్రేయమొంద!

# 5 కర్మ సన్యాసం

1 కర్మ యనుచు, యోగ మనుచు, చెప్పు చుంటివి
నీవు నాకు
అందు ఉత్తమమైన దేదో తెలుపు మనుచు
అడిగె పార్ధుడు!
2 "పరిత్యాగము - అనుష్ఠాన" మనెడు కర్మలు
ముక్తి నొసగు
రెంటిలోన అనుష్ఠానము గొప్పదనుచు తెల్పెకృష్ణుడు!
3 రాగ ద్వేష ద్వంద్వ మెరుగని, ద్వేషకాంక్షలు లేనివాడు
బంధ మెరుగని యోగమూర్తిగ, భువిన వెల్గును
పార్ధ వినుము!
4 మూర్ఖులేమో సాంఖ్యయోగము, వివిధ ఫలముల
నొసగు నందురు
బుద్ధిమంతులు అట్లు తెలుప, రెంటి ఫలములు
ఒకటి గనుక

5 జ్ఞానులే విధి మోక్ష మొందో, యోగులా విధి
ముక్తి నొందు
సాంఖ్య, యోగము లొకే రీతిగ చూచువాడే
ధన్యు డిలను!

6 అనుష్ఠానము చేయకుండా, సన్యసించగ సాధ్యపడదు
శీఘ్రగతిన యోగమూర్త్యే మౌని బ్రహ్మము
పొందు పార్థా!

7 యోగ యుక్తుడు, విశుద్ధాత్ముడు, ఇంద్రియంబుల
గెల్చు దేహుడు
సర్వ భూత ఆత్మ తానుగా, తెలిసి కర్మకు కట్టుబడడు!

8 ఆత్మ తత్వము నెఱుగు మూర్తులు కనుచు
వినుచు తినుచు తిరుగుచు
నిద్ర నడకా సర్వవేళల, కర్మచేతురు కర్తగాక!

9 మాటలందున పనుల యందున,
నిద్రయందున కూడ తెలివిగ
ఇంద్రియంబులు వాటి చేష్టలు, చేయుచున్నవి
యనుచు తలతురు!

10 బ్రహ్మమందున ఆత్మనల్పి, ఫలము బ్రహ్మకే
వొసగు వాడు
పద్మ పత్ర జలము రీతి, పాప పుంజపు బారిపడడు

11 శ్రేష్ఠ వరులా కర్మమూర్తులు, ఇంద్రియంబుల
మమత వీడి
దేహ హృదయ బుద్ధితోడ, చిత్త శుద్ధికి కర్మచేతురు!

12 నిశ్చయాత్ముడు నిష్ఠతోడ, కర్మచేసి ముక్తినొందును

నియమ నిష్ఠలు లేనివాడు, కామ్య కర్మ౹
"బంధీ' యగును!

13 సర్వ కర్మల నడలి జ్ఞాని, యింద్రియమ్ము౹ నిగ్రహించి
నవ ద్వార, పురమునందు, సర్వ సుఖములనొందు పార్థ!

14 లోక మందున దైవ మెప్పుడు, "కర్త-కర్మల"
సృష్టి చేయడు

సృష్టి యందలి మాయలోబడి ధర్మమా విధి
నడచు చున్నది!

15 ఎవని పాపము, పుణ్య ధనము, దేవు డెన్నడు
తీసుకొనడు

అజ్ఞాన మా విధి, జ్ఞాన నెల్లను, మోసగించి
భ్రాంతినుంచు!

16 ఆత్మ జ్ఞానము ఎటుల యజ్ఞానమ్ము నాశము
చేయు నటుల

తేజ రూప సూర్యకాంతి, ఈశ్వరార్థము నెరుకపరచు!

17 బ్రహ్మ యందున మదిని నిల్పి, పరబ్రహ్మము
తాను యనుచు

బ్రహ్మ జ్ఞాన నిష్ఠనొందిన, జ్ఞాన మూర్తులు
దేహ మొందరు!

18 "విద్య వినయము" కల్గు బ్రాహ్మణు, డావు ఏనుగ
సునక మాదుల

సమక్ దృష్టిన చూచువారల జ్ఞానులనుచు
బుధులు యందురు!

ఆత్మయోగులు కనుక వారలు, మోక్షయోగము నొందుచుంటిరి
26 కామక్రోధములేని వారలు, నిశ్చలాత్ములు, బ్రహ్మజ్ఞానులు
యోగమూర్తులు నా వారికి, బ్రహ్మానందము కలదు పార్థా!
27 బాహ్యశబ్దవిషయములన్ని వెలుపలనుంచి పార్థ
భ్రుకుటిన దృష్టితో ప్రాణాపాన, వాయువాదుల నాసికందున
28 ఇంద్రియాదుల మనోబుద్ధితో నిగ్రహించెడు యోగమూర్తి
వీడి ఇచ్ఛాభయము క్రోధము ముక్తుడౌను తరచి చూడ!
29 యజ్ఞకర్త, భోక్తననుచు, సర్వలోక ప్రభుడననుచు
సకల ప్రాణహితుడననుచు, తెలియునరుడు శాంతిపొందు

o o o

ఇవ్విధంబున వాసుదేవుడు "కర్మసన్యాస" యోగమంతయు
తెలిపె పార్థునకనుచు దీనిని, సంజయుండు తెలుప విభునికి
దానినెల్ల తెలుగుచేసె వేటపాలెమున రామకృష్ణుడు
భక్తజనులు భజనచేయుచు వాసుదేవుని కృపను పొందగ

# 6 ఆత్మ సంయమ యోగము

1 కర్మసల్పెను యతియు యోగియు, అగ్నిహోత్రము,
కర్మచేయక
సన్యాసనగ చెల్లదయ్య అదియే ఆత్మసంయమంబు!
2 "సన్యాసమ్మ"యనెడు దానిని తెలుసుకొనుము పార్థనీవు
కార్యదీక్ష పట్టుదలలు, లేని మనుజు యోగికాడు!
3 యోగశక్తి కోరువానికి, సాధనమ్ము కర్మయోగము
సర్వకర్మ నివృత్తి పొందు యోగమూర్తి శమము
నొందు
4 ఇంద్రియాదుల నదిమిపట్టి, వాటి కర్మల తగులు కొనక
ఇహఫలంబులు కోరనట్టి, అతడే యోగిగ వరలు భువిన
5 ఆత్మనణగ ద్రొక్కకీవు, ఆత్మనాత్మనే వుద్ధరింపుము
ఆత్మకాత్మే బంధువవగ, ఆత్మకాత్మే శత్రువగును
6 ఇంద్రియంబుల గెల్చినట్టి, జ్ఞానికాత్మ పరమబంధువు
ఇంద్రియాదుల గెలువనేరని, వారికాత్మ పరమశత్రువు!
7 సుఖము దుఃఖము చలియు వేడి, గౌరవాదుల
భ్రమను వీడు
జితేంద్రియుండు పరమశాంతుగు, దైవదర్శన
భాగ్యమొందు
8 జ్ఞానరూపుడు శాస్త్రకారుడు ఇంద్రియాదుల గెల్చు
ధీరుడు

కాంచనమ్ముల మట్టినొకటిగ యోగమూర్తై చూచు
నెపుడు!

9 హితుడు శత్రువు బంధుజనుల, సాధుమూర్తుల పాప
రూపుల
ద్వేషమెరుగని సమతబుద్ధిన చూచు పార్థా! సుహృ
దుండు!

10 ఏకాంతమందున ఇంద్రియమ్ముల నిగ్రహించి యోగ,
ధ్యానము
సలుపువారలు చింతలన్నీ విడచి సాధన చేయవలెను

11 అంత ఎత్తు పల్లమవని శుభ్రమైన దర్భపరచి
లేడి చర్మము, వస్త్రమాదులు వేసి పద్మాసనము నందు

12 నిగ్రహించి ఆత్మపార్థ, ఇంద్రియాదుల నొక్కపట్టి
శుద్ధహృదిన వీడిచింతలు, విషయ వాసనలనుచు
తెలుపక

13 శిరసు దేహము కంఠమాపుల సమముగాను నిల్పియుంచి
నాసికాగ్రపు చివరదృష్టి, ఇతర దిక్కులు చూడకుండా

14 భయము వీడి శాంతమొంది, బ్రహ్మచర్య వ్రతనొంది
నన్నే చూచుచు నన్ను తలచుచు, నన్ను కోరి తపము
సల్పు

15 ఆత్మతృప్తి పొంది మనుజుడు, మనసు నిలకగ స్మరణ
చేయుచు
మోక్షశాంతులు, నన్ను పొందుచు, యోగిరాజై వరలు
చుండె!

16 తిండితినని నుండు వాడు, అతిగతినెడు తిండిపోతుకు
నిద్ర మొద్దుకు, నిద్రలేమిక, ఈ యోగమసలు లభ్య
మవదు
17 మితాహారము తీసుకొనుచు, నిత్యకర్మలు, తగిన నిద్ర
కల్గి కాలము గడుపువానికి, యోగసిద్ధి కల్గు పార్థా!
18 కోర్కెవీడిన నియతచిత్తము, ఆత్మయందే నిలచి
యుండ
విషయవాసనలన్ని వెలు , యోగియుక్తుండౌను
మనుజుండు
19 ఆత్మసంయమయోగ మొందు, యోగినిశ్చల నియత
స్థితిని
గాలిలేని ప్రాంత దీపంబనుచు బుధులు తెల్పిరర్జున!
20 యోగమందున చిత్తమొప్పు శాంతి పొంది తృప్తి
నొందునో
అపుడే చూచి ఆత్మనాత్మను, తృప్తితుష్టి పొందు
చున్నది
21 దివ్య సుఖము ' అనెడు దానిని, బుద్ధి చేతనే
పొంద దగును
ఆత్మ తత్త్వము నందుయున్న, వారె యట్టి
సుఖము పొందు!
22 ఆత్మ సుఖము పొంద గోరి ఇతర లాభము
లిచ్ఛగించక
ఆత్మ తత్త్వము నందు ఎపుడు కష్టమనుచు బాధపడక!

23 దుఃఖ శమన యోగ మోగి, వియోగ యోగా
సక్తు డవక!
ఖేద మొందక దీక్షతోడ, నియతబుద్ధిన బద్ధినొందు!
24 సంకల్ప గాప కామ్యములను, విడచి మనసును
నిగ్రహించి
ఇంద్రియంబుల కట్టి పెట్టి, విషయ వాసన లదిమిపెట్టి!
25 అన్య చింతలు విడచిజీవి, ఆత్మయందే మనసునిల్పి
మెల్లమెల్లగ ధైర్యమొందుచు ధ్యాన మార్గము
నొందవలెను!
26 స్థిరములేని చంచలాత్మ- ఎట్టి కోర్కెల
మునిగి యుండో
అట్టి కోర్కెల నిగ్రహించి జీవి ఆత్మకు వశముకావలె
27 ప్రశాంతి పొందిన శాంత హృదయుడు,
పాప మెరుగని బ్రహ్మ రూపుడు
యోగ మూర్తిగ భువిన వరలుచు, పరమ
సౌఖ్యము పొందు పార్థా
28, పాప రహిత యోగమూర్తి, ఆత్మ యోగము
పొంది అర్జున
బ్రహ్మ జ్ఞానము, బ్రహ్మ పథము సంతసమ్ము
పొందుచుండెను!
2 తనను ఆత్మగ సర్వ జనుల, సర్వ జీవుల ఆత్మతానుగా

యోగ దృష్టిన చూచువాడే యోగి భావము
పొందు మం॥

30 సర్వ సృష్టిన నన్నుచూచుచు, నాలో సర్వ సృష్టి
చూచెడు
నాకు వానికి భేదమున్నది, లేదు పార్థా! లేదు! లేదు!

31 ఏక భావము పొంది ఎవడు, సర్వ భూతస్థితుడనగు నన్ను
వేరు భావము లేక భజన, చేయువాడు నన్ను పొందు

32 సర్వజీవుల సుఖము దుఃఖము, తనవి యనుచు
భావ మొందుచు
బాధ పడెడు అతడు శ్రేష్ఠుడు, ఉత్తముండు!
ఉన్నతుండు!

33 "సర్వ భూత సమదృష్టి" అని వాసుదేవా
నీవు తెల్పు
ఈ యోగమెటుల చూతు నేను " అనుచు
కుంతీ పుత్రుడడిగె!

34 క్షోభ కొల్పుచు చంచలాత్మ ఇంద్రియంబులు
ధృఢ ...
మనో నిగ్రహ మాయెగాని ఎటుల నిగ్రహ
మొందుటయ్యా!

35 సంశయమ్ము వలదు పార్థా! నిగ్రహము
సాధ్య పడదు
సాధనమ్మో! వైరాగ్యమ్మో, అభ్యసించి
మదిని పట్టుము!

36 నిగ్రహించక మనసు పార్థా [illegible] యోగము
పొంద కష్టము
బుద్ధి పూర్వక యత్నమందున నిట్టి యోగము
పొందు యనగా!

37 సాధన చేయక శ్రద్ధ గల్గియు, యోగమునందుండి
చలన మొందిన
మనోవికారమున యోగము పొందక, ఎట్టి స్థితిని
పొందును కృష్ణా!

38 బ్రహ్మజ్ఞాన మార్గమునందు, స్థిరమగు
చిత్తము లేని మనుజుడు
[illegible]టికి చెడిన చెదిరిన మేఘము, రీతిగ నాశము
పొందడుగాదా

39 నా ఈ సంశయ భావము తొలగించ, కృష్ణా
నీ కన్న వేరెవరు లేరు
నా ఈ సంశయము తొలగించి నన్ను, కావగ
వేడెద కరుణాలవాలా!

40 ఉభయ భ్రష్టుండైన, నాశనమ్ము పొందడయ్యా
మంచి వానికి దుర్గతి యన్నది లేదు పార్థా
యనుచు కృష్ణుడు!

41 యోగ భ్రష్టుడు, పుణ్యాత్ములు వాసముండెడు
స్వర్గమందు
పెక్కుకాలము సుఖములొంది పిదప సిరుల ఇంటపుట్టు

42 అట్లు కాని ఎడలవాడు, జ్ఞాన యోగుల ఇంటపుట్టు

ఇట్టి జన్మము పొందుటన్నా, అమిత కష్టము
లోకమందున!

43 యోగివర్యుల ఇంటబుట్టి, పూర్వ జన్మపు వాసనొంది
సిద్ధిగోరకై దీక్ష బూనుచు, యత్నసిద్ధికి పాటుపడును!
44 పూర్వ జన్మ వాసనొందిన ఆత్మయోగి సాధకుండు
వేద కర్మలు చేయునంత పుణ్యఫలము పొందు పార్థా!
45 అమిత సాధన చేయుయోగి పాప కర్మల వీడిపోయి
జన్మ జన్మల సిద్ధినొంది, అంత్యకాలమున బ్రహ్మనొందు!
46 తపశ్శాలురు శాస్త్రవాదులు నిత్య కర్మలు
చేయు వారల
కన్న మిన్నగ యోగి పరగు కనుక యోగివి!
కమ్ము పార్థా!
47 యోగు లందరిలోన నన్ను, మదిన శ్రద్ధగ సేవచేయు
ఘనుడు యోగ శ్రేష్ఠుడనుచు, నాదు మతము
వినుము పార్థా!

° ° °

కృష్ణ దేవుని "ఆత్మ సంయమ" యోగమంతయు
సంజయుండు
తెలుప కౌరవ విభుని కెల్ల, దాని తెలుగుచేసె భువిన
భక్త జనులు పాడుకొనగ "రామకృష్ణు"డు
కృష్ణ మహిమన!

# 7 విజ్ఞానయోగం

1 మదిని స్థిరము చేసి అర్జున, సంశయంబుల పారద్రోలి
నన్ను కర్తగ సర్వ ప్రభుగ, తెలియ చేసెదు
విధము వినుము!

2 ఎట్టి జ్ఞానము పొంద జగతిన, ఇతర జ్ఞానము లక్కరవవో
అట్టి జ్ఞానము తెలిపెదేను, వినుము పార్థా!
విడి చింతలు!

3 వేయి మంది కొక్కమనుజుడు, సిద్ధి కొరకై
నాత్ర పడును
అట్టి వారిలో ఒకడు మాత్రమే, నన్ను తెలిసి
పొంద గలడు!

4 మాయ ప్రకృతి యందు నేను, భూమి నీరు నిప్పు గాలి
మనసు బుద్ధి అహము గగనము" అనుచు
నిల్పితి అష్ట రూపుల!

5 ఇట్టి మాయ "కన్న మిన్నగ" "పరా ప్రకృతి"
యంచు కలదు
ఇదియే సకల జీవశక్తియు, సర్వలోక "రక్ష" పార్థా!

6 పరాప్రకృతి ప్రకృతాంగులు, సర్వజీవుల మూలమనగ
సర్వ సృష్టికి స్రష్టనౌచు, నాశనమ్ము నేనేచేతు

7 నన్ను మించిన దేది పార్థ! లేదు ప్రకృతి యందుచూడ
సూత్ర మందలి మణులరీతి, సృష్టి నాలో
నిబిడి యున్నది

8 జలమందలి సారమేను సూర్య చంద్రుల
కాంతి నేను
నేనే వేదపు ప్రణవ శబ్దము, గగన నిస్వన,
పురుష హుంకృతి!
9 భూమి యందలి సుగంధమంతయు, అగ్ని యందలి
తేజమంతయు
సర్వ ప్రాణుల ప్రాణ సర్వము, తపస్వులర
తపము నేను!
10 బుద్ధిమంతుల బుద్ధి నేను, తేజోవంతుల తేజమేను
సకల ప్రాణుల నిత్యమైన జన్మ కారణ మేను పార్థా!
11 ధైర్యవంతుల యందు నున్న, ఆశ పాశము
లేని బలమై
సకల ధర్మ గ్లానికాని, కాయ మేనుగ తెలియు పార్థా!
12 సత్వ రాజస తమో గుణములు, నేనే సృష్టిచేస్తి పార్థ!
నాకు లోబడి గుణము లున్నవి, నేను వాటియందు లేను,
13 మూడు గుణముల మోహ మొందుచు, జగతి
భ్రాంతిని మగ్గు చున్నది
వాని మెరుగని ప్రభుడనైన, నాదు వునికిని
మరచు చున్నది!
14 ఈశ్వరాత్మక నిట్టి మాయ, దాట శక్యము కాదు నేరికి,
నన్ను శరణము నొచ్చు వారికే ఇట్టి మాయను
దాట శక్యము!
15 పాప రూపులు, మూఢ మూర్తులు, మాయ కమ్మిన
నీచ మనుజులు

జ్ఞాన హీనులు అసుర మూర్తులు, నన్ను ెణ ు
పొంద లేరు!

16 ఆపదందున నున్నవారలు, యూశ్వార్థ ం
నె ుగు వా లు
ధనము, జ్ఞాన ు కోరు వారలు! నన్ను కోరి
సేవ చేతురు!

17 నలుగు రందున నిత్య యోగియు, శుద్ధ భక్తి
జ్ఞాని శ్రేష్ఠుడు
అట్టి భక్తుడే నాకు ప్రియుడు, నేను వానికి
మిగుల ప్రియుడ!

18 భక్తులందరు శ్రేష్ఠులైనను, జ్ఞా మాత్రము
మిగుల శ్రేష్ఠుడు
నేనే ఆత్మగ నన్ను నమ్మిన, జ్ఞాని నన్ను
మించి ఎరుగును!

19 వేల జన్మల పుణ్య ఫల న "వాసుదేవుడే
సర్వ జగతిగ"
జ్ఞాని నన్ను తెలిసి ుదు అట్టి జ్ఞానే నాడు ు కి

20 కామ్య ం ల ు ము ుగ, మనుజులి లలో
సట్టి దేవ్వుల
ప్రాజ చేసి ు, అట్టి దేవ్వు
చెరు చుంటిరి!

21 ఏ విధ కామ్య ోయు ము ఏయే దేవత
ప్రార్థన సల్పునో

ఆయా శ్రద్ధ స్థిరమగు శక్తిని, ఒసగెద నేనని
విమోహనుయ్ పార్థా!
22 శ్రద్ధతో ఆయా వేల్పుల పూజ, సల్పిన మనుజుడు
ఆవిధి కామ్యము
ఫలముల నొందుచు సంతోషించును, ఆవిధే ఆతని
కాతును నేను!
23 వేల్పుల పూజలు నొసగును ఎపుడు, నాశరూపమౌ
స్వల్ప ఫలములు
నన్ను కొలిచెడు వారలు పార్థా! నాశన మెరుగని
నా పథమొందు!
24 అవ్యక్తుడనగు పరమోత్తమమౌ, నాపథ భాగ్యము
శక్తియు నెరుగక
రూపు నొందిన జీవుని రీతి, బుద్ధి హీనులు
తలుతురు పార్థా
25 త్రిగుణాత్మక ఘనమాయన నున్న నన్ను తెలియగ
తరమేనేరికి?
జనన నాశము నెరుగని నన్ను, నుగాన లేక లోకము
కృంగె!
26 నిన్న—నేడు రేపుగూర్చిన, జీవజాతకమంత తెలియు
నన్ను తెలియ తరము కాని, వింత తత్వము నాది పార్థా
27 జన్మతోడనే రాగద్వేష, సుఖము దుఃఖము ఇష్టాష్టము
ద్వంద్వ భావము కల్గుచుండె, మోహమందున ముంచు
చుండె!
28 పుణ్యకర్మలు చేయు జనుల, పాపమంతయు క్షీణమవగ

2 "అధి యజ్ఞము" అనగనేమి? దానినెటుల చేయుటయ్యా
అంత్యమందున నిశ్చయాత్మము ఎటుల నిన్ను తెలియ
గలరు!
3 నాశమెరుగని పరబ్రహ్మ ఆధ్యాత్మం బనిఎరుగు పార్థా
భూత భావము ననుసరించి సలుపు యజ్ఞము
కర్మయాను
4 నాశనమగ్మ దేహధారుల నిలచియున్న దేఅధి భూతము
సూర్యాదుల గతుల నెలుపు పరబ్రహ్మమే అధిదైవము
దేహమందున ఆత్మరూపున నిలచియున్న నన్ను పార్థా
అధి యజ్ఞము యనుచు తెలియుము, సర్వకర్మల కేను
కర్తను!
5 మరణకాలమునందు నన్ను స్మరణచేసి విడి దేహము
అట్టివారలు నన్ను చేరుట, నిక్కమనుచు ఎరుగు పార్థా
6 మరణకాలము నందు అర్జున, ఎట్టి భావన చేయుచుండో
అట్టి భావన, అట్టి భావన, వ్యక్తి పొందుట నుంత
ఎఱుగుము
7 కనుక సర్వవేళలందు నన్ను స్మరణచేయు చుండి
సర్వకర్మలు నొసగినాకు, పోరుసల్పుము పార్థ నీవు!
8 ఇతర విషయములందు మదిన కొంచెమైనను నిలుపకుండ
దివ్యపురుషుని గూర్చి సాధన, చేయవలెను
ఉత్తమత్వము!
9 నిశ్చయాత్మన చిత్తమంతా "ధృవు"న నిల్పిన
మనుజవర్యుడు

దివ్యరూపుడు, సర్వవ్యాప్తుడు, సూర్యతేజోసమ
ప్రభుడు!

10 మరణకాలమునందు ఆతడు, చక్రవృత్తుల శివుని కొసగి
సర్వజీవుల దేవదేవుని గాంచి ముక్తిని పొందు పార్థా!

11 "అక్షర" మని వేదవేత్తలు, ద్వంద్వమెరుగని
బ్రహ్మనిష్ఠన!

యతులుపొందెడు దివ్యయోగము తెల్పుచుంటిని
వినుము అర్జున!

12 ఇంద్రియాముల సర్వమెవడు, విషయ వాసనలందు
నిల్పక

యోగశక్తిన "మూర్ధ్న" మందే, మనసు నిల్పెడు
వాడు యోగి!

13 "ఓం" అనుచు పరబ్రహ్మము, కూర్చి స్మరణము
చేయు వ్యక్తి

వీడిదేహము నన్నుపొందు, అట్టిమోక్షమే శ్రేష్ఠమిలను

14 ఇతర విషయములందు చిత్తము, నిలుపకుండా స్మరణ
చేసెడు

దివ్యయోగికి నేను వస్యుడ, అట్టె భక్తుడే నన్నుపొందు!

15 పరమ పథమును పొందు దివ్యులు, శోకమన్నది
చేరనీయరు

జన్మయన్నది లేదు వారికి, నన్నుపొందిన దివ్యశక్తిన

16 బ్రహ్మలోకము దాకవెళ్ళి, మరల జన్మము పొందినట్టి
వారునన్ను స్మరణచేయ, మరల జన్మము
పొందరయ్యా''

17 బ్రహ్మదేవుని పగటికాలము, "వేయి యుగములు" యనుచు వినుము
రాత్రికూడా అంతే కాబున, కాల పరిమితి ఎరిగి చనుము
18 పగటి యందున జననమొందిన వ్యక్తులు రాత్రి యందు
నాశనమ్మును పొందు పార్థా! ఇదియే "చిత్ర సృష్టి" మాయ
19 సర్వభూతము లెల్ల పగలు పుట్టుచున్నవి
అటులనే జనన, మరణ మర్థున, కాలమీ తీరు సాగుచున్నది
20 బ్రహ్మకన్న ముందు చెప్పెడు, పరబ్రహ్మము చాలా గొప్పది
సర్వభూతకోటి గిట్టిన, పరబ్రహ్మము గిట్టడయ్యా!
21, నాశ మెరుగని రూపంబని ఉపనిషత్తులా దివ్యగ్రంథము
అట్టిగానిని పొందిజన్మము, మరల పొందవు పరమ పథమున
22 సర్వజీవకోటులన్ని, సర్వసృష్టియు ఎవనియందు
కలదో అట్టి పరమపురుషుడు భక్తిచేతనే పట్టుబడును!
23 ఎట్టివేళ యోగివర్యులు మరణమొంద పరమపథము,
పునర్జన్మ పొందోనట్టి, విషయ మింకయు వినుము పార్థా!
24 అగ్నిజ్యోతి పగటిపూట, శుక్లపక్షము ఉత్తరాయణ
కాలమందు మరణమొందు, వారు బ్రహ్మను పొందురయ్యా!

25 ధూమరాత్రి కృష్ణపక్ష దక్షిణాయణ కాలమందు
మానవమొందెడు వాడు చంద్రలోకముంది జన్మమెత్తును
26 జగతియందున నిత్యమైనవి శుక్ల కృష్ణపక్షగతులే
జన్మమీయని దొకటియైన జన్మనొసగెడి దొకట పార్థా!
27 వీటి మార్గము నెఱిగి యోగి, మోహభ్రాంతుల
మునుగడయ్యా
కాన అర్జున! యోగబుద్ధిని సర్వవేళల యోగివవుము
28 వేదయజ్ఞ తపసు దానము నొసగు ఫలముల
భ్రాంతి నొందక
శ్రేష్ఠమైన ప్రథమ ఫలమౌ పరమపథమును
పొందుమర్జున!

○ ○ ○

ఉపనిషత్తులు బ్రహ్మవిద్యయు మిళితయోగశాస్త్రమౌ
"అక్షరా" పరబ్రహ్మయోగము-రామకృష్ణుడు
తెలుగుచేసె!

# 9 రాజ విద్యా రాజ గుహ్య యోగము

1 ఎట్టి జ్ఞానము ఎఱిగినందు దుఃఖమంతయు తొలగిపోవునో
అట్టి దానిని చెప్పుచుంటిని వినుము యనెను కృష్ణ
దేవుడు!
2 "రాజవిద్యా రాజగుహ్యము" శ్రేష్ఠమైనది, తెలియ
తగినది

స్వానుభవము కల్గుదానిని తెల్పుచుంటిని వినుము పార్థా!

3 శ్రేష్ఠమైన దీనిని ప్రజలు శ్రద్ధలేక, తెలుసుకొనక
నన్ను చేరక జననములందు, ఇంద్రియంబున స్రుక్కుచుండె!

4 తెలియనెంచని నాదుశక్తిని సర్వసృష్టి సాగుచున్నది
భూతకోటులు సర్వమర్జున, నన్ను చుట్టే నిలచియున్నవి

5 భూతజాతులు నన్ను నిల్పవు, నాలో లేవు భూతకోటులు
భూతసృష్టి నేనుచేతు, ఐనా కాను భూతనిలయం

6 సర్వస్థలములు సంచరించెడు, వాయువెటుల గగనమందున
నిత్యముండునో అటులే నాలో, భూతకోటులు నిలచియుండు!

7 జగతియందలి భూతకోటులు, నాదుమాయన కల్పమందున
లయము నొంద మరల వాటిని, సృష్టిచేసెద కుంతిపుత్రా!

8 నాదుశక్తిని మాయనొందిన, అస్వతంత్ర భూతకోటుల
మరల మరల సృష్టిచేసెద, అదియే "ప్రకృతి" వినుము పార్థా!

9 కర్మబంధములంట నిలువని, తటస్థుండను నేను కాన
కర్మలెన్నడు నన్ను అంటవు, బంధన కర్మ చేయబోవు!

10 నేనే పతిగా భూతజాతులు, ప్రకృతాది సర్వసృష్టియు

జగతియందున పుట్టుచున్నవి, 'జగతి' యనగా నేనే
పార్థా!

11 సర్వభూత నిలయుడను నా సృష్టి తత్త్వము నెఱుగలేక
మూర్ఖ దేహులు, హీనబుద్ధిని నాదుశక్తిని
ఎఱుగరారు!

12 వ్యర్థకోర్కెలు, వ్యర్థకర్మలు సల్పుచుండెడు హీన
బుద్ధులు
అసురరూప మోహమొంది, దుష్టప్రకృతి నొందు
చుంటరి!

13 దైవీసంపద కోరు శ్రేష్ఠ కర్మమూర్తులు నన్ను పార్థ
గొప్పవానిగ తలపి ఎఱిగి, యోగ బుద్ధుల సేవచేతురు

14 సతతకీర్తన చేయు వారలు, దృఢవ్రతులు, భక్తిపరులు,
నిశ్చలాత్మన నిత్యయోగిగ, నాదు సేవలు చేయు
చుంటిరి

15 జ్ఞానయజ్ఞము చేత కొందరు విశ్వరూపుడ నైననన్ను
ఏకరూపుగ భిన్నమూర్తిగ, పెక్కువిధముల పూజ
చేతురు!

16 నేనే క్రతువు యజ్ఞమయ్యది స్వధ యుండను, ఔషధాను
హవిసుమంత్రము లగ్ని హోత్రము, హోమ ద్రవ్యములన్ని
నేనే!

17 జగతి కంతయు తల్లి తండ్రి, పవిత్రము, శ్రేష్ఠ నేను
తెలియఁదగిన సర్వవేదము, ప్రణవమ్మును నేనే
పార్థా!

18 జగతి ంతయు ఎఱియుగతియు, సాటిరూపము ఈశ్వ
రుండు
ఆశ్రయమ్మ, మిత్రమండలి, నా మెరుగని బీజమేను!
19 సెగలు పొగలవేడి నేను, నిలచి కురిసేవాన నేను
అమృతమ్మ, మృత్యుదేవత, సత్తుచిత్తులు నేనే పార్థా!
20 వేదమధ్యయ నలుపువారలు, పూజచేసి సోమపాన ము
గ్రోలిస్వర్గము, పుణ్యమైన ఇంద్రభోగము లొందు
చుంటు
21 పుణ్యమంతయు సమసిపోగా, తిరిగి మానవ రూపమెత్తి
కోర్కెబట్టి రూపుదాల్చి జననమరణము లొందు
చుంటిరి!
22 ఇతర చింతలు లేక నన్ను, ఎవరు కోర్కెలు వీడి
కొలుతురో
అట్టి వారల సర్వచింతలు తీర్చు దీక్షను కల్గియుంటిని!
23 ఎవరు ఇతర దేవతాదుల, ఎట్టభక్తిన పూజచేతురో
అటులే నన్ను వారలందరు, పూజచేయుచుంట సిద్ధవ!
24 సకల యజ్ఞభోక్త నేను, యజ్ఞపురుషుడ నేనె పార్థ!
యజ్ఞచిత్తులు నన్ను తెలియక, జననమరణము లొందు
చుంటిరి!
25 దేవతాదుల పితృదేవల ఇతర యాత్రా పూజ చేసెడు
వారు వారల పొందుచుండ, నాదు భక్తులు నన్ను చేరు!
26 పత్రమైన పుష్పమైన, ఫలమైన జలమైన
భక్తితోడ నొసగ నాకు, స్వీకరింతును మిగుల ప్రేమను!

# 10 విభూతి యోగము

1 నాదువాక్కులు ప్రతిమీరి, వినెడు పార్థా
తెల్పుచుంటిని
నీదు హితమును కోరి తెల్పెద, నాదుతత్త్వము
మరల వినుము
2 మునిజనంబులు దేవతాదులు, నాదుశక్తిని ఎఱుగలేరు
ఋషిగణంబులు, మహర్షాదుల, సర్వోత్పత్తి నేనే కను!
3 సకలలోక ఈశ్వరుండగు, నన్ను తెలిసికొనిన వారు
మనుజులందున జ్ఞనయోగ్యై, పడిసాపము ముక్తి కొందు
4 బుద్ధి జ్ఞానము అప్రమత్తత క్షమయు సత్యము
దమ మలన్న
సుఖము దుఖము కలదు లేదన, భయము
అభయ మన్ని పార్థా
5 తృప్తి, తపము కీర్తి, దానము, అహింసయు
సమతావృత్తి
భూతగణముల వివిధభావన కారణము నేనే యర్జున!
6 సప్తఋషులు మనువులందరు నాదుప్రేమ
వలనే పూర్వము
నాదుమనమున జన్మనొంద, పిదప మనుజులు పుట్టినారు!
7 నాద మహిమలు యోగమంతయు నిశ్చయముగ
ఎరిగె మనుజుడు
యోగ బద్ధిని పొందుచుండు నన్న లేదిల సంశయము!

8 జగతియంతయు నావలన కల్గిన, కల్గుచు బుద్ధిమంతులు
సర్వశక్తిగ నన్ను తలచి, నామ సేవలు చేయు చుంటిరి!
9 మనోప్రాణములన్నికూడ, నాదురూపుగ లయముచేసి
నన్నే తలచి, మరియువారలు, పొందు నిత్య
సంతసమ్ము
10 అట్టివారల నుద్ధరింపగ, ఆత్మయందున జ్యోతియగుచు
అజ్ఞాన తిమిరము రూపుమాప, జ్ఞానజ్యోతియైతి నేను
11 ఎల్ల వేళల యోగబుద్ధిన నన్ను భజనచేయు వారల
కొసగుచుంటిని నన్ను చేరెడు, యోగబుద్ధిని
వినుము పార్థా!
12 "పరబ్రహ్మ! పరంధామ, పరమపురుషా! తేజోరూపా
ఆదిదేవుడ,వజుడ వీవు, స్వప్రకాశా! అప్రమేయా!
13 నారదుండు అసిత, దేవల, వ్యాసుడాదిదివ్య ఋషులు
ఎటుల చెప్పిరో అటులే నీవు, నీమశక్తినిచెప్పుచుంటివి!
14 కృష్ణ! దేవా నీవు చెప్పిన దంత నేను సత్యమందును
నీదు రూపా, భావములను, దేవదానవులెవ్వరెరుగరు
15 సకల భూత సృష్టికర్తా! జగత్పాలక, దేవదేవా!
నిమశక్తుల నీవె చెప్ప అన్యులెరుగుట తమచ్చెప్పిన!
16 సర్వజగముల నిండియున్న, నీదు దివ్యమహిమలన్ని
తెలుపనీకే తరము గాను, తెలియగోరు నాకు తెల్పుము!
17 నిన్ను తెలియగోరి చేయు, ధ్యానమార్గములో
తెలుపుమయ్యా
ఎట్టిభావము పొంది నేను, నీదు సేవచేయగలను!

18 లోకరక్షక, దేవ దేవ! నీకు యోగము మహిమ(గోల
తరవి లేకున్నదయ్యా! మునల [illegible] వాటికన్నిటి
19 వినుము యర్జున నేను తెల్పెద, అంతులేని
నాదుమహిమలు
దివ్యమైన వాటియందు, ముఖ్యమైనవి తెలుసుకొనుము
20 సకలభూత ఆత్మనేను, నానసృష్టి [illegible]మేను
సృష్టిలయము నేనే పార్థా! ఆత్మల[illegible] ఆత్మ నేను!
21 ఆదిత్యులందు విష్ణువగుచు, జ్యోతులందున సూర్యుడౌదు
మరుతులందు మరీచి నేను, తారలందున చంద్రుడేను
22 వేదమందున సామవేదము, దేవతా దుల ఇంద్రుడేను
ఇంద్రియమ్ముల మనసు నేను, సర్వభూతపు
"శక్తి" నేను
23 రుద్రులందున శంకరుండ యక్షరాక్షస వల్లభుండ
అష్ట వసువుల అగ్ని నేను, పర్వతమ్ముల
మేరు నేను!
24 పురోహితుల ముఖ్యమైన బృహస్పతియు నేనే పార్థా
స్కందుడనగా నేనే వినుము, సాగరుండను
నేనే అర్జున!
25 మహర్షులందున భృగువు నేను, మాటలందున
ప్రణవమేను
యజ్ఞమందున జపయజ్ఞము! [illegible]మన్నగము
నేనే పార్థా!
26 వృక్షమందున రావిచెట్టు, దేవఋషుల నారదుండను
చిత్రరథుడను నేనే పార్థా! సిద్ధ[illegible]ముని నేను!

27 అమృతంబు తోడ బుట్టిన, ఉచ్చైః శ్రవంబు
నేనే పార్థా!
గజములం దైరావతనమ్మ, నరులలోన నృపుడనేను!
28 ఆయుధమ్ముల వజ్రమేను, గోవు లన్నిట
కామధేనువు
మన్మథుండను నేనే యర్జున! సర్ప శ్రేష్ఠ వాసుకేను!
29, నాగులందున అనంతుండను, నీటి నొసగు
వరుణ దేవుడ!
పితృదేవుల ఆర్య ముండను, శిక్ష సల్పెడు
యముడ నేను!
30 దైత్యుల ప్రహ్లాదు డేను, గణిత శాస్త్రపు
కాల మేను
మృగము లందున సింహమౌచు, పక్షి గణముల
వైన తేయుడ!
31 పావనమ్మౌ వాయుదేవుడ, శస్త్ర ధారుల
రామ చంద్రుడ!
చేప జాతిన మొసలి నేను, నగుల గంగా
నదియే నేను!
32 సకల సృష్టి ఆదిమధ్యము అంతమాదులు నేను పార్థా!
విద్య లన్నిట ఆత్మ విద్యయు, "వాది"లోనివాదమేను
33 అక్షరమ్ముల "అ" కారమేను, "ద్వంద సమాస"
మేను యనగన
అంత మెరుగని కాలమేను, విశ్వరూప "ధాత" నేను

34 సంహారించెడు మృత్యువన్న! పుట్ట బోయెడు
జన్మ యన్న
స్త్రీల లోని, కీర్తి, సంపద, వాక్కు బుద్ధి
స్మృతియు నేను!
35 సామ మందున బృహత్సామము, గాయత్రి యనెడు
ఛంద నేను
మార్గ శీర్ష మాసమేను, వసంతంబను
ఋతువు నేను!
36 మోస గాండ్రుల జూదమేను, తేజో రూపుల
తేజ మేను
జయము గొందెడి వారి జయము, సత్వ మూర్తుల
సత్వ మేను!
37 యాదవాదుల కృష్ణు డనగ, పాండ వాదుల
పార్థు డనగ
మునులు శ్రేష్ఠ వ్యాసు డనగ, నేనే కవుల
శుక్రు డనగ!
38 దండనంబున "దండ" మేను, నీతి పూర్వక
జయము నేను!
"మౌన" మనగా నేనే పార్థా! జ్ఞాన శ్రేష్ఠుల
జ్ఞాన మేను!
39 సకల భూతపు బీజమేను, కదలి "కదలని"
సృష్టి నేను!
సర్వలోక భూత కదలిక, నేను లేక జరుగ దెన్నడు

40 అంత మెరుగని మహిమ లెక్కో కలవు పార్థా
తరచి చూడ

నాదు మహిమలు తెలియ గోరిన నీకు కొన్ని
తెలియ జపితి

41 ప్రాణికోటి సర్వ మంతయు, శ్రీమ శంబ
మహిమ కూడిన

నాదు అంశము నందునుండే, ఉద్భవించే
ననుచు తెలియుము!

42 విభూతులన్ని తెలియ చేయ, వినగ తరమా
నీకు పార్థా!

ఏక అంశము నందు జగతిన, నిల్చియుంటిని
నేను అర్జున

ｏ ｏ ｏ

అనుచు తెల్ప ప్రీతి మీార, కృష్ణ దేవుడు
పాండు సుతునకు

'విభూతి యోగ" నామ మనెడు దాన్ని
తేట [illegible] ంగు

రామ కృష్ణుడు సకల జనులు భువిన [illegible]
చేయ గోరి

తెనుగు చేసె పాట [illegible]పున, భ[illegible] సులకు
[illegible]!

# 11 విశ్వరూప సందర్శన యోగము

1 నన్ను కావగ ఉత్తమోత్తమ, ఆత్మ విద్యను
తెలిపి నాడవు
నీదు హితమున చిత్తమందున, శాంతి నొందితి
ననుచు పార్థుడు

2 వింటినయ్యా నీదు లీలలు, శక్తు లెన్నో కృష్ణ! దేవా!
సర్వ భూత స్థితియు నీవని, ఎరిగి ధన్యుడ నైతి దేవా!

3 పరమ పురుషా! నీవు చెప్పిన, సర్వ ధర్మము
లన్నె వినగా
దేవదేవా, నీదు దివ్య, రూప ధారణ చూడ గోరితి!

4 నేను చూడగ, తరము యనగా చూపుమయ్యా
నీదు రూపము
విశ్వరూపా! నిత్యమైన, నీదు ఆత్మ
రూపు చూపుము!

5 పెక్కు రంగులు, పెక్కు రూపులు, దివ్యరూపము
లెన్నో యున్న
వివిధ రూప విశ్వ రూపము, చూడ గోరిన
చూడు మర్జున!

6 సూర్యుడాది వసువు రుద్రులు, మరుత్వాది అశ్వినులను
నీకు తెలియని అద్భుతంబౌ, పెక్కు రూపము
లిచట చూడు!

7 జగతియందున చూడకోరెడు సర్వసృష్టి యంత దాక

దేవతాదుల! భూత కోటుల, ఋషుల పాముల
బ్రహ్మ సైతం
16 విశ్వరూపా, విశ్వనాథా, విభిన్న బాహు,
మోము కన్నుల
చిత్రమనగా చూచుచుంటిని, ఆది మధ్యము
అంత మెరుగక!
17 కిరీట గదల చక్రధారిని, తేజో రూపుని, విశ్వమూర్తిని
చూడ శక్యము కాని వానిని, ప్రజ్వరిల్లెడుఅగ్ని సముని
సర్వ రూపుని, సూర్య రూపుని, సర్వ స్థలముల
అప్రమేయుని
చూచు చుంటిని దేవ, దేవా! నీదు దేహమునందునేను!
18 నాశ మెరుగని, తెలియ దగిన, నిత్యమైన
బ్రహ్మ రూపుని
ఆశ్రయంబను, ధర్మ మూర్తిని, చూచు చుంటిని
పరమ పురుషా!
19 ఆది మధ్యము అంత్య మెరుగని, పెక్కు చేతుల
దివ్య మూర్తిని
సూర్య చంద్రులు కనులుగాగల, స్వప్రకాశ
స్వీయ తేజుని
ప్రజ్వరిల్లెడు అగ్ని మోముల, సర్వ సృష్టి
మూర్తి మయుని
"దేవ దేవుడ!" గాంచు చుంటిని, నీదు రూపున
యనుచు పార్థుడు!
20 ఆకసంబు, భువిన నడిమి స్థలము నంతా ఆవరించి

సకల దిశల నిండియున్న చిత్రరూపుడు భయద శక్తికి
మూడు లోకము లొక్కసారి, భయము నొందుట
గాంచి నేను
చూచు చుంటిని నీదు రూపు, ఒడలు జలదరించు రీతి!
21 దేవతాదులు నిన్ను చేరగ, కొందరేమో
భయము నొందుట
మహర్ష్యాది సిద్ధ గణములు "స్వస్తి వాచక"
మొసగ నీకు
పెక్కు రీతుల వినుతి చేయుచు, స్తోత్రపాఠములప్పగించ
విశ్వ రూపా వందనమ్ము, నీకు సర్వదా వందనమ్ము!
22 ఆదిత్య రుద్రులు, వసువు సాధ్యులు విశ్వేదేవతా
అశ్విన్యాదులు
మరుత్వాది పితృ గణములు, యక్ష రాక్షససిద్ధులంతా!
గంధర్వాది గణము తోడ విశ్వ రూపా నిన్నుచూచి
సంభ్రమొందుట చూచితేను, దేవ దేవ వందనమ్ము!
23 పెక్కు ముఖములు, కనులు కోరలు, తొడలు
పాదము లెన్నో కడుపులు
భయము గొల్పెడు కోరలేమో చూచి లోకము
లన్ని కూడ
భయము నొందుట గాంచి నేను, అభయ మొసగుము
ఆది దేవ!
నా భయము తీర్చుము ఆది దేవా, అభయ
మొసగుము ఆది దేవా!
24 ఆకసమ్ము నంటి యుండి, ఎక్కురంగుల తేజరిల్లు

37 యముడు వాయువు అగ్ని వరుణుడు, శాంతపరచే చంద్రుడీవు
ప్రజాపతియూ ప్రపితామహా,మ లవందనసహస్రమ్ము!
38, సర్వరూపా, సర్వ తేజా, సర్వ జగతిన వ్యాప్తరూపా!
అంతులేని వీరవిక్రమ, వందనమ్ము! వందనమ్ము!
39 నీదు మహిమను తెలియ నేను, ఎన్నడైనను ఎప్పుడైనను
చనువుచేత కృష్ణయాదవ, మిత్రమనుచు పిలువమూర్ఖిగ
నీదు భక్తుడ ననుచు దేవ, నాదు తప్పును కావవయ్యా!
శిరము మోడ్చి వేడుచుంటి కరుణ నన్ను కావుమయ్యా
40 నీవె తండ్రివి పుణ్యమూర్తివి, గురులకెల్ల పరమగురుడవు
నీకు సముడు మూడులోకము లెన్న వెదకిన కానరాడు
41 స్తవము చేయదగిన శివుడవు, నీవు యనుచు వందనమ్ము
తండ్రి బిడ్డల, హితుడు మిత్రుని, ప్రియుడు ప్రేయసి తప్పు సైచెడు
రీతి నన్ను కావు కృష్ణా! నాదు తప్పులు సైచుమీవు
నీవె నాదు రక్షగాంచెదు, దైవమనుచు నమ్మి యుంటి!
42 అదృష్టమనగా విశ్వరూపము చూచి ధన్యుడనైతిదేవా!
మదిన దాగిన భయముదీర్చ, సౌమ్యరూపము వేగ దాల్చుము!
43 వేయి చేతుల విశ్వరూపా, కిరీట చక్ర గదలు దాల్చిన
నాల్గుచేతుల నీదు రూపు, చూడగోరితి చూపుమయ్యా!
44 అర్జునా! భక్తుడనుచు ప్రేమ చూపిన ఇతరులెవ్వరు గాంచలేని
దివ్యరూపము ఆత్మయోగ శక్తితోడ చూపితనుచు

# 12 భక్తి యోగం

1 నిన్ను కొందరు పూజచేయ, బ్రహ్మపూజ చేయుకొందరు
పూజసలుప అధికులెవ్వరు! అనుచు అడిగె అర్జునుండు!
2 భక్తి శ్రద్ధల నన్ను తలచు నిత్యమును నను కోరువారలు
శ్రేష్ఠమూర్తులు "పార్థ!" అనుచు తెలిపె కృష్ణుడు
భక్తియోగము!
3 ఇంద్రియంబుల నిగ్రహించి, సమపు బుద్ధిని కల్గియుండి
సకల భూతపు హితము కోరుచు, మనసు వాక్కుల
నన్ను తలచు
4 నిత్య సత్యమైన నన్ను నిఖిల లోకాధారుడనుచు
పరబ్రహ్మగ భావనమ్ము చేయువారు నన్ను పొందు!
5 నాశమెరుగని బ్రహ్మగాంచుట తరముకాదు ఎవ్వరికైన
దేహధారులు నన్ను పొందగ, పెక్కు శ్రమలు
పొందుచుంటరి!
6 నన్నె తలచి, నన్ను కోరుచు, నా స్వరూపును మదినిల్పి
సకల కర్మలు నాకు నొసగి, ఏకాంతబుద్ధిని స్మరణచేయ!
7 జననమరణ రంధిమాప, కాలగతిన తగులుకొనక
త్వరితగతిన కాతునయ్యా, నాదు భక్తుల నేను పార్థా!
8 నీదు మదినీ నాదు రూపున, నీదు బుద్ధిని నన్ను చేర
నిశ్చలాత్మన నిల్పు పార్థ, నీవు నాలో నిండియుందువు
9 ఇంతదనుక నీదు చిత్తము నాదు రూపున నిలుపకున్న [!]
సాధనమ్ము చేసి పార్థా, నన్ను చేర చూడుమయ్యా!

19 "నాది-నేనను" మమత వీడి వున్న జ్ఞానితో
తృప్తినొందు
నిశ్చలాత్ముడు ధీరవర్యుడు, నాకు భక్తుడు
మిగుల ఇష్టుడు
20 నన్ను కోరెడు వారు నాదు, ధర్మయుక్తమంతా ఎరిగి
అమృతమ్ము రీతి దీనిని, గ్రోలువారలు నాకు ఇష్టులు

o o o

ఇట్టి "భక్తియోగమంత కృష్ణదేవుడు పాండుసుతునకు
తెలుప దానిని తెలుపుచేసె—రామకృష్ణుడు కోరిభక్తి!

## 13 క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

1 ప్రకృతీ పురుషుండంచు, క్షేత్రక్షేత్రజ్ఞ యోగము
"జ్ఞాన-జ్ఞేయము" అనగనేమో, తెలియచేయుం నాకు
కృష్ణా!
౧ ఈ శరీరమే క్షేత్రమయ్యా! దీని ధీమంతి క్షేత్రజ్ఞుండు
ఇదియే తెల్పిరి తత్వవేత్తలు, అట్టి దానిని వినుము
తెల్పెద!
సకలక్షేత్రమూర్తి నేననీ, క్షేత్రక్షేత్రజ్ఞాదియోగము
తెలియగోరుట శ్రేష్ఠమనెదు, నాదుమతము ను వినుము
పార్థా!

4 క్షేత్ర భావరూప గుణములు, క్షేత్రజ్ఞమూర్తి
భావమంత
తెలియచేసెద కొద్దిగాను, వినుము దానిని కుంతిపుత్రా!
5 క్షేత్రక్షేత్రజ్ఞాది వివరము వేదమందున ఋషులు తెల్ప
బ్రహ్మసూత్రము కూడ తెల్పె, సంశయమ్ము
నొందకుండా!
6 క్షేత్రమందున పంచభూతము, లహంకారము
బుద్ధి మనసు
ఇంద్రియంబులు పదియు పార్థా! విషయ వాసనలైదు
వున్నవి
7 ఇచ్ఛాద్వేషము సుఖము దుఃఖము, చేతనాదుల కూడి
ధైర్యము
క్షేత్రమందున నిలచియున్నవి, వినుము పార్థా!
వివరమంత!
8 హింసలేని ఓర్పుకల్గి సత్ప్రవర్తన గురువుసేవలు
చిత్తస్థైర్యము నిగ్రహమ్ము, కాంక్షలేని కోరికలతో
9 అహము వీడి, రక్తికోరక, దంభములను ఎప్పుడు పలుకక
జన్మమృత్యువు బాధలనుచు, ముసలితనము
వ్యాధులనుచు
10 భార్యాపిల్లలు, ఇల్లువాకిలి, "నాది-నేనను" మమత వీడి
కష్టమైనా ఇష్టమైనా, ఒకేరీతిగ సంచరించుచు
11 ఏకభావము, ఏకదృష్టిన అంతరొకటను దీర్ఘదృష్టిన
నిశ్చలాత్మన నాదుయాపున భక్తియుంచుట జ్ఞానమగును

12 ఆత్మజ్ఞానమొందు బుద్ధిన, తత్వజ్ఞానమూర్తి యగుచు
జ్ఞానమొందని భిన్నరూపము, అజ్ఞానమనుచు
చెప్పబడును
13 ఏది తెలియ కల్గు మోక్షము, ఏది ఆదిలేని బ్రహ్మమో
ఏది సత్తా చిత్తా కాదనో, అట్టి జ్ఞేయము తెల్పెదిపుడు
14 కాళ్ళు చేతులు, కళ్ళు తలలు, ముఖము చేతులు
కల్గిజగతిని
ఆవరించి వున్నదయ్యా! అట్టి జ్ఞేయము తెలియవయ్యా!
15 ఇంద్రియంబులు లేక వాటిని కాంతివంతము
చేయునట్టిది
సంగమెరుగక, సర్వాధారము, నొంది గుణములేక భోగిగ
16 సర్వభూతము లందువుండి, "చరాచరం" బనుచు
తెలియ
సూక్ష్మమైన రూపమొంది, తెలియశక్యము కాని
విధమున
17 చేరువనగ, చేతికందని విధమునుండి సృష్టియంతట
ఏకరూపున నిలచియుండి, భిన్న రూపుల మూర్తినొంది
18 భూతకోటి సర్వసృష్టిని తాను చేయుచు తెలియదగిన
రీతిజగతియందు వరలుచు, వివిధరూపుల తోపుచున్నది
19 తమసుకెల్ల పరముయగుచు, జ్ఞాన, జ్ఞేయ, గమ్య
మనుచు!
సర్వమానవహృదుల నిలచెడు, దివ్యశక్తే జ్ఞేయమయ్యా!
20 క్షేత్ర, జ్ఞానము, జ్ఞేయరూప తెలిసిన భక్త
సద్యుడు

నాదుభావము తెలిసి యర్జున, నన్ను పొందుట
కర్హుడౌను!

21 ప్రకృతినెడు, పురుషుడనెడ ఆదిమూర్తుల తెలిసికొనుము
గుణవికారములన్ని పార్థా! ప్రకృతియందున పుట్టుచున్నవి

22 "కార్యకారణ కర్త" హేతువు ప్రకృతిగుచునిలువజగతిన
సుఖము దుఃఖము, అనుభవాదులు, పురుషుడౌట
తెలియుమయ్యా!

23 ప్రకృతియందున వున్న పురుషుడు, గుణములందున
సంగమొంది
మంచి, చెడ్డ జన్మలొందుచు, ప్రకృతొసగెడు
ఫలములొందు

24 అట్టి పురుషుడు తాను పరుడను రీతి దేహమునందు
నిలచి
తటస్థుండు, భర్త, భోక్త, ఈశ్వరుండు దైవమాయెను

25 ఆత్మ, ఆత్మేతరంబైన, ప్రకృతియంతయు ఎఱుగునాతడు
సర్వకర్మలుచేసి కూడ, బంధమెరుగక బ్రతుకు చుండె!

26. ఆత్మయందున ఆత్మకొందరు, ఆత్మచేతనే చూచుచుండ
జ్ఞానయోగము చేతకొందరు కర్మయోగ మొంది
కొందరు

27 దర్శనమ్మును చేయుచుండ, ఇదియు నెఱుగని వారు
కొందరు
శ్రవణమందున తృప్తికొందుచు, మోక్షమే మోపొందు
చుంటిరి

28 "చరమొ, అచరమొ ' సర్వ వస్తువు లెట్టివైన

క్షేత్రక్షేత్రజ్ఞాది కలయిక, నొంది రూపము పొందు
చున్నది

29 క్షేత్రమేమో నాశమైన, తాను నాశన మొందకుండ
సర్వభూతముల అందు నిలచిన, శివు చూచెడు వాడు
ధన్యుడు!

30 సర్వవ్యాపక ఈశ్వరుణ్ణి, సర్వస్థలము లయందుచూచుచు
ఆత్మనెట్టి విధమునైన హింసచేయని వాడు శ్రేష్ఠుడు!

31 సర్వకర్మల కారణమ్ము ప్రకృతనుచు తెలుసు కొనుచు
ఆత్మకర్మకు కారణమ్ము కాదు యనుకొను వాడు
ధన్యుడు

32 ఆత్మయందు ఏకరూపును, భిన్నరూప భూతజాలము
పెక్కు రూపులు గాంచు వాడు, బ్రహ్మస్థితిని పొందు
పార్థా!

33 ఆదియంతములేని బ్రహ్మ క్షేత్రమందున నిలచి
యున్నను
ఎట్టి కర్మకు కర్త కాడు సంగమందున తగులు కొనడు!

34 విస్తరించియున్న గగనము! ఎటుల దేనికి తగులు కొనదో
అటులే ఆత్మ దేహమందు, నిలచి ఉండియు బంధ
మెరుగదు!

35 సూర్యుడెటుల లోకమంతయు, కాంతివంతము
చేయోనటుల
క్షేత్రమంతయు క్షేత్రజ్ఞుండు ప్రకాశింప చేయు చుండె!

36 జ్ఞాన నేత్రముచేత జీవి క్షేత్రక్షేత్రజ్ఞాది భేదము
భూత ప్రకృతి మోక్షమార్గము తెలియ ముక్తుండౌను
పార్థా!

ం ం ం

అట్టి దివ్య క్షేత్ర క్షేత్రజ్ఞాది భాగయోగ తత్వము
పాండు సుతునకు తెలుప కృష్ణుడు అట్టి దానిని
రామకృష్ణుడు
తెనుగుచేసే తేటతెనుగున ధరను నల్వురు పాడుకొనగ
భుక్తిముక్తులు నొసగే గీత నిత్యస్మరణమిలను జరుగ

## 14 గుణత్రయ విభాగ యోగము

1 మునుల కందరి కుత్తమ మ్మ విద్యలన్నిట శ్రేష్ఠమైన
పరమ విద్యను తెల్పుచుంటిని, పార్థా వినుము,
సావధానము!

2 ఇట్టి జ్ఞాన ము పొందినట్టి మనుజ వర్యులు నన్ను పొంది
సృష్టికాల ం నందు పుట్టరు, ప్రళయమందున
దుఃఖ పడరు!

3 "మహద్ బ్రహ్మ"మంచు నేను బీజ రూప సృష్టిచేతును
అందు నుండీ సకల భూత సృష్టి జగతిన జరుగుచున్నది!

4 జగతి యందున జన్మమొందెడు సర్వ మూర్తుల
గతిని చూడ
ప్రకృతేమో తల్లి పార్థా! బీజ ప్రదుడౌ నేను తండ్రిని!

5 ప్రకృతిచేత పుట్టుచున్న, సత్వ రాజస
తమో గుణ ములు
సత్వ ఆత్మను పట్టి పార్థా! దేహమందున నిల్పుచున్నవి
6 మూడుగుణముల శ్రేష్ఠమైన, స్వప్రకాశ మొందు
సత్వము!
జ్ఞాన సౌఖ్యము లందుకోర్కెన, నిల్పెనాత్మను
దేహమందున!
7 విషయవాసన, విషయ వాంఛ, కుప్పతెప్పల
రజో గుణము
కర్మ సంగి మొంది ఆత్మను, దేహమందున కట్టివేసె!
8, మోహ రూపుకు మారరూపము, తమోగుణము
పట్టినాత్మను
మరుపు నిద్రల శక్తిచేత దేహమందున కట్టివేసె!
9 సత్వగుణము సుఖములందు, రజోగుణము కర్మలందు
జ్ఞానశక్తిని తమో గుణము, నావరించి చేయునాశము!
10 సత్వ మితర గుణములందు సత్వమాదుల రజోగుణ ము
సర్వోజముల తమోగుణము గెలిచి తనదు శక్తి చాటు!
11 ఈ దేహద్వార మందు పార్థా! ఇంద్రియాదుల
అంతరంగము
ఎప్పుడు జ్ఞాన వృద్ధిపొందో, అప్పుడే సత్వ గుణము కల్గు!
12 లోభవ్యాసక్త కర్మలెన్నో, అశాంతి, ఆశల వెంబడించు
రజోగుణము కల్గినట్టుల, భవనమ్ము పొందు పార్థా!
13 మూఢ భావము మొండితనము, జ్ఞానలేశము లేక
పార్థా!

నశచునపుడే తమోగుణము, కల్గినటుల తెలియు
మయ్యా !
14 సత్వగుణమున నీ దేహము, విడిపోయిన ఉత్తమంబౌ
జ్ఞానవాదుల పొందు పుణ్య లోకజాలములన్ని పొందు !
15 రజోగుణుడు వీడ దేహము, కర్మమూర్తుల ఇంట బుట్టు
తమోగుణుడు వీడ ప్రాణము, మూఢ జీవుల యందుపుట్టు !
16 సత్వకర్మల నిర్మలత్వము, రాజసమ్మున తీవ్రదుఃఖము
తామసమ్మున పోయి జ్ఞానము, కల్గుగుణముల ఫలము
గనుము !
17 సత్వమందున జ్ఞానగుణము, రాజసమ్మున లోభగుణము
తమము వల్ల మోహమాదులు, కల్గుచున్నవి కుంతి
పుత్రా !
18 సత్వమూర్తులు ఊర్ధ్వలోకము, రాజసాదులు నడుమ
ప్రాంతము
తామసాదులు అధోలోకము, పొందుచుంటిరి పాండు
పుత్రా !
19 మూడు గుణములు సంసారమూల, మనుచు తలచెడు
ఆత్మజ్ఞాని
ఆత్మ తత్వము నరయనపుడే, మోక్షమొందుచుండే
పార్థా !
20 సత్వరాజస తమోగుణముల, జీవిదాటుచు బయలు
పడెగా
జనన మరణ రూప చక్రము వీడిముక్తిని పొందుచుండే

21 ప్రభో! కృష్ణా! మూడుగుణముల దాటు పురుషుని, లక్షణంబు తెలియచేసి
వీటి నెటుల అతడు దాటో, అట్టి వివరణ తెల్పుదేవ!
22 మూడుగుణముల నధిగమించిన ఆత్మయోగి గుణములందు
సంగమొందడు, కాంక్షనొందడు, తననువీడిన బాధపడడు!
23 మూడుశక్తులు ప్రజ్వరిల్ల, చలనమొందక వాటికెపుడు
తటస్థుండై తిరుగునయ్యా, ఆత్మయోగై వాటిమరచి
24 మంచిచెడ్డ సమము యనుచు తలచి తృప్తి చెందుయోగి
మట్టిబెడ్డా కాంచనమ్ము ఒకేరీతిగ చూచునయ్యా!
25 గౌరవాకులు, శతృమిత్రులు, ఇష్టమయిష్టా సర్వకార్యము
ఒకేరీతిగ చూచువాడు, గుణాతీతుండనగ చెల్లు!
26 ఇతరవిషయ చింతలెఱుగక, భక్తితోడ భజనచేసెడు
అట్టి ఘనుడే గుణత్రయము, అధిగమించి బ్రహ్మనొందు!
27 నిత్య సత్య నిర్వికార, పరబ్రహ్మము, సర్వధర్మము
సుఖము కంతకు కర్త నేనే, ఆశ్రయుండను నేనేపార్థా!

o o o

"గుణత్రయ విభాగయోగము" తెలుప కృష్ణుడు పాండుసుతునకు
తెలుగచెసే రామకృష్ణుడు దానినెల్ల తేట తెలుగున

# 15 పురుషోత్తమ ప్రాప్తి యోగము

1 పైన మూలము క్రిందకొమ్మలు, నాల్గువేదము లాకు
లయిన
నాశమెరుగని "అశ్వత్థమ్ము" వేదవిదుడే తెలియగలడు!
2 వాటశాఖలు గుణాలు లొంది, విషయ రూపచివురుగలిగి
పైకి క్రిందకు వ్యాప్తి చెంద వేరులేమో మనుజలోకము
నందువ్యాప్తి చెందియున్నవి
3 ఇట్టివృక్ష స్వస్వరూపము, మూలమసలే అర్థమవదు
పాతుకున్న దీర్ఘవేళ్ళ, సంసారరూప వృక్షరాజము
4 నిష్కామ శస్త్రము దాల్చి దాన్ని, ఛేదనమ్ము చేయ,
ఎదప
అనాదిరూప మరల జన్మ లభ్యమవని పదము యిబ్బ!
5 మానమోహాలు వీడువారు, కామవర్జిత ఆత్మ
యోగులు
ద్వంద్వ మెరుగని జ్ఞానమూర్తులు, నిత్యసత్య మోక్ష
మొందు
6 జన్మమెరుగని మోక్షపదము, అగ్నిసూర్య చంద్రగతుల
మించివెళ్లెడు ఉత్తమంబౌ, నాదుస్థానము పదముపార్థా!
7 నిత్యమైన నాదు అంశ, జీవరూపము దాల్చి భువిన
ఇంద్రియంబులు నారుతోడ, మదిని వశ్యపరచుచున్నది
8 మధురవాసనలీను వాయువు ఎటుల జగతిని సోకి
చనునో

అటువే శివుడు దేహమందలి ఇంద్రియంబుల కూడిచనును
9 జీవుడప్పుడు కనులు చెవులు ము క్కు నాలుకమనసు
స్పర్శల
విషయవాసనలొంది సౌఖ్యము, ననుభవించుచుండె
నిలను
10 ఆత్మరూపుని వివిధచేష్టలు, కార్యకారణ కర్మలన్నీ
తెలివితేటల చూడగొందరు, మూర్ఖులేమో కానబోరు
11 ఆత్మయోగాశక్తులైన బుద్ధిమంతులు ఆత్మనున్న
పరబ్రహ్మము చేరుసాధన, చేయు నొల్లరు ఎట్టి
వేళన !
12 జగతినెల్లను కాంతివంతము చేయు సూర్య, చంద్ర,
అగ్నుల
తేజమంతయు నేనే పార్థా ! నాదు శక్తియే వారి
తేజము !
13 భూమియందున ఓజశ్శక్తిగ, చంద్రునందలి రసపు
రూపుగా
భూతజాతుల బ్రోచనేను, సస్యజాతుల కాచుచుంటిని
14 "జఠర" రూప అగ్ని నేనై దేహధారుల దేహమందున
ప్రాణా, పానము పార్థా నేనై, అన్నమంతయు
శక్తి చేఎద!
15, సర్వభూత హృదియే నేను, నేనే మఱపు జ్ఞాన,
జ్ఞేయము !
నేనే సకల వేదరూపుడ, వేద కర్మా, కర్త భర్తను!

16, "క్షరము – అక్షర"మనుచు జగతిన! రెండువిధములు
పురుషులుండె
భూత కోటులు క్షరముగాను, జీవుడక్షర మౌచునిలచె
17 మూడు లోకము లావరించి నిత్యుడనుచు వెలుగునట్టి
ఈశ్వరుండే పురుష శ్రేష్ఠుడు, జగతి కాచెడు
పర బ్రహ్మము!
18 నేను "క్షరము-అక్షరమ్ముల" దాటినట్టి శ్రేష్ఠవర్యుడ
లోకమందున, వేదమందున "పురుష శ్రేష్ఠుడ" నైతినేను
19 జ్ఞాన వంతుడు నన్ను పార్థా! "పరంధాముడు"
యనుచు నెరిగి
సకల మెరిగి సర్వ భావన తోడ నన్ను భజనచేయు!
20 పరమ రహస్య యోగశాస్త్రము, తెలియ జేతి
నీకు పార్థా!
ఎవరు దీనిని తెలుసు కొందురో, వారుధన్యులు
బుద్ధిమంతులు,

o o o

అట్టి "పురుషోత్తమ" ప్రాప్త యోగము పాండు
సుతునకు చెప్ప కృష్ణుడు
తేట తెన్గున రామకృష్ణుడు, వ్రాసె మిగుల భక్తితోడ

# దైవాసుర సంపద్విభాగ యోగము

1 అభయ సత్వశుద్ధి జ్ఞానము, దానశీలము నిగ్రహమ్ము
యజ్ఞ వేద యోగతపము, సత్ప్రవర్తన, అహింసాదులు
2 కోప మెరుగక, లోభి కాక, విషయ వాసన లందుమున్గక
భూత దయయు, వినయశీలము, లజ్జ ఓర్పు ధృతియు
శుచియు,
3 ప్రతిభగల్గి స్వాతిశయము లేక వాదనలందు నిల్వక
ద్రోహబుద్ధి మాట ఎరుగని, వారే దివ్యులుభువినపార్థా
4 కపట గర్వము, స్వాతిశయము, అహంకారము
కోపతాపము
కఠిన చేష్టలు, జ్ఞాన లోభి అసుర రూపుకు మారుపేరు
5 దైవసంపద ముక్తి నొసగ, అసుర సంపద కూల్చివేయు
దైవసంపద రూప పార్థా! దుఃఖమింకను వీడుమయ్యా!
6 లోకమందున భూత జాతులు, "దైవ-అసుర"
మూర్తులనుచు
రెండు విధముల పుట్టుచున్నవి, అసురశక్తిని
వినుము నిపుడు!
7 అసుర సంపదగొంది మూర్ఖులు, కర్మజ్ఞాన
మార్గ మెరుగక
శుద్ధి బుద్ధి సత్యమన్నవి, మచ్చుకైనను కానబోరు
8 అసురమూర్తులు "సత్య, ధర్మము, దైవమన్నవి లేవు"
యనుచు

మనిషి-మగువు, కామకాంక్షలే, జగతియనుచు తృప్తి
పడెదరు
9 అల్పబుద్ధులు క్రూరకర్ములు, లోకహితము
తెలియలేరు
నష్టరూపులు లోకనాశము కోసమిట్టి పుట్టుచుండిరి
10 పాపరూపులు పాపాచారులు, కపటమూర్తులు, గర్వ
రూపులు
తనివితీరని కోర్కెలందున, మునిగి తేలే భ్రష్టమూర్తులు
11 అనుభవించుట యోగమనుచు, అదియె జీవి
ధ్యేయమనుచు
ప్రళయమంత్య చింతచేత పొందు వ్యర్థను
అసుర పాపి
12 కామ క్రోధమూర్తి యగుచు దుష్టవాసనలెన్నో కలిగి
కామభోగము ధనమే భువిన, స్థిరమనుచు తలచు
చుందురు
13 ఇంత పొందితి, ఇంత వచ్చును, ఇట్టి లాభము నాకు
కలుగు
చింతతీర్చును ఇట్టి కామ్యము, ఇదియె భోగంబనుచు
తలచు
14 వీణ్ణి చంపితి, వాణ్ణి చంపెద, నేనే దేవుడ, భోగి, సిద్ధుడ
నాదుబలము చూడవయ్యా నన్ను మించిన సౌఖ్య
మెక్కడ?
15 ధనము కల్గితి, గొప్పవాడను! వంచిలమున
బుట్టినాడను!

యజ్ఞయాగములన్ని చేసెద ధనము నొసగెద
చూడమనుచు
16 జ్ఞానమార్గము లేని వారై చిత్తభ్రమల చిక్కుబడుచు
మోహమూర్తిగ, కామరూపుగ, నాశనమ్ము పొందు
చుంటిరి
17 తమదు గొప్పలు తామే చెప్పుచు, డబ్బు తెచ్చిన
గుడ్డికీర్తిన
మదము నొందీ నామమాత్రపు యజ్ఞయాగము జరుపు
చుందురు
18 అహంకార, దర్పబలము, గర్వకామ క్రోధమొందుచు
వారిలోన ఎదుటి వ్యక్తుల వున్న నన్ను కించపరతురు
19 క్రూరమూర్తుల పాపరూపుల, అధమపరులౌ అట్టినరుల
అసురయోనిన ఎపుడు నేను, జన్మమొంద చేతునయ్యా!
20 అసుర జన్మమొంది మూర్ఖులు, నన్ను కనుగొను
శక్తిలేక
జన్మజన్మల క్రింది, క్రిందకు మరీ క్రిందకు పోవుచుంటిరి
21 కామ క్రోధ లోభమనెడు, నరకద్వారులు, చూడు
మనుజన
ఆత్మనాశన మూలరూపులు, వీటినెపుడు విడువవలయు
22 అజ్ఞానపాప వీటనెవడు, వీడి జ్ఞానము ధనము పొందో
అట్టివాడే ఆత్మ తెలిసి, ముక్తి మోక్ష మార్గమొందు
23 నియతశాస్త్ర రీతి విడచి, కామ భోగసుఖములందున
నిలచి కాలము గడుపువాడు, సిద్ధి, ముక్తి మోక్ష
మొందడు!

24 మంచిచెడుల తెలియచేయు, కార్యకారణ రూపమనెడు
శాస్త్రధర్మము నీకు గాన, నియతకర్మను
చేయుమయ్యా!

○ ○ ○

అనుచు తెల్పె దైవాసుర-సంపదాదుల" దివ్యయోగము
కృష్ణదేవుడు పాండుసుతునకు, అట్టి దానిని
రామకృష్ణుడు
తెలుగుచేసె సర్వజనులు, ధరణియందున స్మరణచేయ
వాసుదేవుని దివ్యలీలలు, విషయవాసన లన్ని విడచి

# 17 శ్రద్ధాత్రయ విభాగ యోగము

1 శాస్త్రవిధుల ననుసరింపక, శ్రద్ధతోడ పూజసల్పెడు
వారి పూజలు సత్త్వరాజసతామసాదుల నెట్టివయ్యా!
2 ప్రాణులన్నీ స్వీయసిద్ధ సత్త్వరాజసతామసంబను
మూడువిధముల శ్రద్ధనొందు, దాని నీవు
వినుము పార్థా!
3 సర్వప్రాణ అంతరంగము, తదనుగుణ్య శ్రద్ధగొందు
పురుషుడెట్టిభావనొందో, అట్టి భావన రూపమొందు!
4 సత్త్వమూర్తులు దేవతాదుల, రాజసాదులు
యక్షరాక్షస
తామసాదులు భూతప్రేత, పూజలిడులో సల్పుచుండిరి

5 శాస్త్రవిహిత ఘోరతపము, దర్పదంభ అహంకారులు
కామరాగ బల గల్గి ప్రాణులిలలో చేయుచుండిరి
6 అట్టివారలు దేహములలి నన్ను కృంగదీయు చర్జునా
బుద్ధిలేని అసురచేష్టల, దుష్టరూపగ ములు చుండిరి!
7 సర్వజనులకు మూడువిధములా హారమున్నది పార్థభువి
అటులే యజ్ఞతపము దానము మూడు విధముల
జగతినున్నది
8 ఆయు, సత్వగుణము బలము, సుఖము సౌఖ్య
ఆరోగ్యమ్ము
వృద్ధిచేయు సారవంతహార మేమో సత్వమూర్తులు
9 చేదు పులుపు ఉప్పు వేడి ఎండిపోయిన, రజాతులు
దుఖశోకము కల్గుచేయు హారమొందురు రాజసాములు
10 నిలువయుండి, రసములే, పాసిపోయిన మిగిలిపోయిన
యజ్ఞశేషము కాని హారము, ప్రీతి తిందురు
తామసాదులు
11 శాస్త్రరూప విహితపూర్వక ఫలము కోరని యజ్ఞ
కర్మము
శ్రేష్ఠమనుచు చేయుగుణమే, సత్వమనుచు
తెలియుమయ్య
12 గొప్పకొరకై, ఫలము కోరుచు, చేయబూనెడు
యజ్ఞకర్మము
రాజసాదుల చేష్టలనుచు, తెలియుమయ్యా నీవు పార్థా!
13 శాస్త్రవిధము, అన్నదానము, మంత్ర, దక్షిణ,
శ్రద్ధలేక

జరుపబడెడు యజ్ఞమన్నది, తామసాదుల చర్యలయ్యా!
14 దేవద్విజుల గురువు జ్ఞానుల శ్రద్ధతోడ పూజచేయుట
సత్ప్రవర్తన బ్రహ్మచర్యము, అహింసాదులే "దేహ" తపము
15 పరుల మనసు నొవ్వకుండా, సత్యప్రియమౌ హితపు మాటలు
వేదశాస్త్రము లన్ని చదివెడు తపమే "వాక్కు తపము" యందురు
16 శుద్ధమనసు సౌమ్యభావ , మౌనమాత్మ నిగ్రహమ్ము
శాంతి రూప హృదియు పార్థా, "హృదయ" తపముగ చెప్పుచుందురు
17 శ్రేష్ఠమైన శ్రద్ధతోని, ఫలము కోరని యోగయుక్త
నరుడుచేసెడు మూడుతపసులు, సత్వగుణపు చేష్టలయ్యా
18 తనదు గొప్ప, గౌరవమ్ము, తనదు పూజ చేయగోరుచు
డాంబికమ్ముగ జరుపగోరుచు, చేయుతపమే రాజసమ్ము
19 మూర్ఖ పట్టున తనకు కీడు, హానిఇతరులకు చేయునట్టి
దుష్టమైన తపసు యున్నదే, అదియే తామస మనగ పార్థా!
20 పుణ్యసమయ, స్థల కాలము, ఫలముకోరక పాత్ర దానము
సలుపునట్టిదే శ్రేష్ఠమయ్యా! అదియే సాత్విక మందురయ్యా!
21 ఫలముకోరి లబ్ధివేసి, కొంత లాభము కొంత చూచి
చేయుదానము రాజసంబు, మధ్యమంబన అదియే పార్థా!

22 దుష్టచేష్టం దుష్టనడతల, యోగ్యమనని వానికిచ్చేడు
దానమున్నదే భువిన పార్థా! తామసంబని
ఎరుగుమయ్యా!
23 బ్రహ్మయొక్క శక్తే పార్థా! ఓమ్, తత్, సత్తులనగా
"వేదబ్రాహ్మణ యజ్ఞకర్మలు" అంటినుండే పుట్టే
వాక్యము
24 బ్రహ్మవేత్తలు శాస్త్రయుక్త యజ్ఞదాన తప ములందు
"ఓం" అనుచు నన్ను తలచే కార్యమిలలో
మొదలు పెట్టు
25 ముక్తిపరులు యజ్ఞతపము, దానమాదులు సల్పువేళ
ఫలముకోరక "తత్" యనుచు, కార్యమేమో
మొదలు పెట్టు
26 స్పృహ్యద్భావ, సాధురూప, కర్మచేసెడి పుణ్యమూర్తులు
"సత్తు" యనుచు నన్ను పలికి, కర్మలిలలోచేతురయ్యా!
27 తపసు యజ్ఞము దానమాదుల నిష్ఠపూర్వక చర్యలన్నీ
వాని కర్మలతోడ పార్థా "సత్" అనియే చెప్పబడును
28 శ్రద్ధలేక చేయు యజ్ఞము తపసు దానము
"అసత్" లనగ
మనుజజన్మను పొంది పార్థా! జీవి, జగతుల కేమిఫలము?

ఓ ఓ ఓ

అనుచు కృష్ణుండర్జునునకు శ్రద్ధాత్రయ విభాగమంత
తెలుప దానిని తెనుగుచేసె, రామకృష్ణుండిలను భక్తి!

# 18 మోక్ష సన్న్యాస యోగము

1 "సన్న్యాసమ్ము" అనగ నేమో "త్యాగమనెడు" భావమేమో
తెలుప వేడితి నిన్ను కృష్ణా! తేట తెల్లముగాను నాకు!
2 జ్ఞాన మూర్తులు కామ్యకర్మల, విడచి పుచ్చుటే సన్న్యాసమ్ము
ఫలము నాసగే సర్వ కర్మల, విడచి పుచ్చుట త్యాగమగును!
3 తప్పుచేసిన రీతి కర్మలు, విడచిపుచ్చ మనగకొందరు
యజ్ఞ దాన తపపు కర్మలు, వీడగూడ దనుచుకొందరు!
4 పార్థా! నీవు కోరినట్టి త్యాగ విషయ మిపుడుచెప్పెద
త్యాగ మన్నది లోకమందున మూడు విధముల నున్న దయ్యా!
5 యజ్ఞ దాన తపములన్నీ, పావనమ్ము చేయుమనుజుల
కనుక నిట్టీ కర్మలన్నీ, విడువకెన్నడు జేయవలెను!
6 మూడు కర్మల నెపుడు కూడా కాంక్షతోడ చేయకుండా
ధర్మ మనుచు కర్మచేయుట, శ్రేష్ఠమనును నాదుమతము!
7 చేయదగిన కర్మ వీడుట, తగదు పార్థా జ్ఞానమూర్తికి
అటులవిడచిన తామసంబై, మనిషి మనసేమార్చివేయు
8 దేహ నష్ట కష్ట భీతిన, దుఃఖ మొసగు ననుచు కర్మల
విడచిపుచ్చ రాజసంబై ఎట్టి త్యాగ ఫలముపొందడు!

9 మమత వీడ! ఫలము కోరక, నియత కర్మల
సల్పు మనుజుడు
సత్వ గుణపు మూర్తియౌచు తనదు ధర్మము
జరుపు భువిన!

10 సత్వగుణుడు, సంశయమ్ము లేని ప్రాజ్ఞుడు కర్మతలచి
దుఃఖమైనను బాధపడక, సుఖము నొసగే కర్మసలుపడు

11 దేహి ఎప్పుడు సర్వకర్మల భువిన వీడుట సాధ్యపడదు
ఫలము విడచీ కర్మసల్పెడు వ్యక్తి 'త్యాగి''గ
చెప్పబడును

12 ఫలము వీడక కర్మచేయు దేహి మరణము నొందిపిదప
అనిష్ట ఇష్టా, ఇష్టా నిష్టమను మూడు విధముల
స్రుక్కుచుందురు

13 కర్మ తెలిపే సాంఖ్యమందున, సిద్ధి నొసగెడు సర్వకర్మల
కారణంబులైదు వున్నవి, అదియు నీవు వినుముపార్థా

14 సకల కర్మల సిద్ధికొరకు "కర్త, దేహ, మింద్రియంబులు
భిన్న క్రియలు, దైవ"మనుచు కారణంబులైదువున్నవి

15 మనసు వాక్కు దేహ ప్రీతిగ, మనిషి సల్పెడుకర్మలన్నీ
అన్యాయ, న్యాయ రూపమైనను, పైన చెప్పిన
కారణమ్ములే!

16 విషయ మిట్టులనుండ పార్థా! ఆత్మ వీటికి కర్తయనుచు
తలచువారు జ్ఞాన శూన్యుడు, వృధాయోచన
సలుపు వాడు!

17 అహంకార సంగమాదుల, వీడి చేయు ప్రవర్తించునో
అతడు జీవ జాతి మొత్తము సంహరించియు
పాప మొందడు!

18 జ్ఞాన, జ్ఞేయము, విషయ చింతన, కర్మరూపకారణంబులు
కర్మ కర్త, కరణమన్నవి,కర్మాధారా మూడు గుణములు!

19 గుణము తెలిపే సాంఖ్యమందున, గుణ ఘభేదము వబట్టి పార్థా
జ్ఞాన, కర్మ కర్తలన్నవి, మూడు విధాల నున్నవయ్యా

20 భిన్న భూతా జాతులందు, నిన్న భావ ము నాశ మెరుగని
ఏక రూప ఈశ్వరుణ్ణి చూచు వాడే సత్వమూర్తి!

21 సకల భూత జాతులందు, భిన్నరూపా! వేరు భావ ము
కల్గియున్నవనుచు విడిగా, చూచు జ్ఞానము రాజసమ్ము!

22 హేతుయుక్తము, ఈశ్వరార్థము, గాని అల్ప
విషయమందున
సర్వమున్నది యనుచు తలచు జ్ఞానమిలలో తామసమ్మ

23 రాగ ద్వేషము లొంద కుండా, ఫలము కోరక మమత లేక
నియత కాలము నందు సలుపు, కర్మ ఇలలో సాత్వికమ్మ

24 కామ్య రూపుమ, అహంకారుడు, ఎక్కు శ్రమలతో
గొప్ప కోసం
సలుపు కర్మము రాజసంబని, భువిని చెప్పగ
చెల్లు నయ్యా!

25 కర్మ సలుపగ వచ్చు కష్టము, హింస నష్టము
లెరుగకుండా
మూర్ఖపట్టున జ్ఞాన హీనుడు, సల్పు కర్మము తామసమ్ము!

26 ఫలాపేక్ష రహితుడైచ, ధైర్యమొంది ఫలాఫలముల
చలన మొందక కర్మచేసెడు మనుజుడిలలో సాత్వికుండు
27 భార్యాబిడ్డల యందు ప్రేమతో, కర్మఫలము లన్ని
కోరుచు
శుచియు బుద్ధియు లేక పరుల, ధనము కోరెడు వాడు
లుబ్ధుడు
హింస సలుప వెరువకయుని, గణముతోడ శోకమంతస
వివిధ భావన, బాధలన్ని, తెచ్చు భ్రష్టుడు రాజసుండు
28 జడుడు మోసకారి వంచక, పామరుండో శోకమూర్తి
కాలయాపన సల్పువాడిల, తామసుండని పల్కు పెద్దలు
29 గుణముబట్టి బుద్ధి, ధైర్యము మూడు విధముల
నున్న దయ్యా
తెలియజేసెద వటివిషయము వినుము పార్థా శ్రద్ధగాను
30 భయాభయము కార్యాకార్యము బంధమోక్ష
ప్రవృత్త్యాదులు
తెలిసికొనెడు బుద్ధి పార్థా! సాత్వికంబై పరగుచుండు
31 ధర్మాధర్మము, కార్యాకార్యము, యథార్థరూపుకు
భిన్న రీతి
సంగ్రహించెడు బుద్ధిపార్థా! రాజసంబని తెలియుమయ్యా
32 జ్ఞానశూన్యుడు ధర్మమెంచియు అధర్మమునుచు పల్కు
భువిని
సకల చర్యల చిత్రకీతివ, తెచ్చుబుద్ధి తామసంబు!

33 మనోచింతలు, ప్రాణచేష్టలు, ఇంద్రియాదుల సకల చర్యల
ఎట్టి ధృతిని జరుపబడునో, అదియె సాత్విక బుద్ధి పార్థా!
34 ఎట్టి ధృతిని ఫలము కోరుచు నియత ధర్మకామ్య అర్థా
కర్మలన్ని కామ్యబుద్ధిని, జరుపు ధృతియే రాజసంబు!
35 ఎట్టి ధృతిని దుష్టబుద్ధితో స్వప్న భయము శోకముదమ్ము ల
వీడకుండా అనుసరించునో, అట్టి ధృతియే తామసమ్ము
36 ఎట్టసిద్ధిని సాధనమ్ము చేయ దుఃఖము తొలగి సంతస
దివ్యభావనకల్గునట్టి సుఖము మూడు విధములున్నది
37 తొలుత విషము రీతి భ్రాంతిని, పిదప సుధగ తలచు సుఖము
సాధుబుద్ధిని చూడ పార్థా! సాత్వికమ్మని చెప్పబడును
38 ఇంద్రియాదులు నొసగు శక్తి తొలుత సుధగా ముంచు భ్రాంతిని
పిదప కాలకూట విషమై, కాల్చునదియే రాజసమ్ము
39 మొదట, పిదప ఆత్మనెంతో, మోహనమ్ము కలుగచేసి
నీరసమ్ము నిద్రతోడ, ప్రమాదమ్ము నొసగు తమస్సు!
40 భువినగాని, స్వర్గలోకి, దేవతాదుల యందు కాని
మూడుగుణములు వీడినట్టి సత్వమెక్కడ కానరాదు
41 బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులు, వారి గుణముల బట్టి పార్థా

వారి నియత కర్మలిలలో, సల్పుచుండిది శ్రద్ధ మీర!
42 శమదమాదులు శుచియు తపము ఓర్మి సత్ప్రవర్తనమ్ము
జ్ఞానము, విజ్ఞానమాదులు, బ్రాహ్మణంబుల నియత కర్మలు
43 శౌర్య తేజము ధీరదక్షత, ధైర్యమొప్పగపోరు సల్పుట
దాన, సత్పరి పాలనమ్ము, క్షాత్రవర్యుల నియత కర్మ!
44 వ్యవసాయము పశులపాలన, వర్తకమ్ము, వైశ్య ధర్మము
సేవచేయుట శూద్రధర్మము, నియతకర్మము లివియే పార్థా!
45 తనదు సహజ నియత కర్మము, నరుడు చేయుచు సిద్ధి పొందెడు
విధము తెల్పెద వినుము పార్థా! యనుచు కృష్ణుడు చెప్పసాగె!
46 సకల భూతకారణంబై, సర్వజగతిన నిలచి యున్న
ఈశ్వరుణ్ణి కర్మచేత, పూజ సలుప సిద్ధి నొందు!
47 గొప్పదైనను ఇతర ధర్మము, తనదు ధర్మము హీనమైనను
శ్రేష్ఠమనుచు తనదు ధర్మము, సలుపు నరుడు పాప మొందడు!
48 నిప్పునెటుల పొగన యుండునో, అటులే కర్మన దోషముండును
ఐన నరుడు దోషమెంచక, సహజకర్మను చేయవలయును

49 సంగమొందని నిర్మలాత్ముడు, ఆశలేక కర్మత్యాగము
సలుపుచుండెడు నరుడు పార్థా! నిష్కామకర్మ
ఫలము నొందు

50 యోగనిష్ఠుడు బ్రహ్మమొందెడు, ఉత్తమంబౌ జ్ఞాననిష్ఠా
సాధనమ్ము సుంత తెలిపెద, వినుము నీవు ఇంద్రపుత్రా!

51 సత్వబుద్ధిన, సత్వధృతిన, నిగ్రహంబును స్వీకరించి
శబ్దవిషయా రాగద్వేషము విడచిపుచ్చెడు వాడు
ధన్యుడు

52 నిర్జనమ్మౌ స్థలము నందు, మనసు వాక్కుల
నిగ్రహించి
మితాహారము, సతతధ్యానము, సల్పునరుడు
శ్రేష్ఠుడయ్యా!

53 అహంకారము బలము దర్పము వీడమమతా కామ
క్రోధము
శాంతిపొందియు బ్రహ్మనొందెడు, నరుడు తానై నిల్చి
పార్థా

54, బ్రహ్మభూతుడు ఆత్మయందు, బ్రహనొందీ ఆశవీడి
శోకరాగము లేవిలేని, సమతమూర్తై నన్నుచేరు

55 భక్తిచేతనే నరుడునన్ను నాదుస్థితిని తెలుసుకొనుచు
నాదుపథము చేరునయ్యా! నేను యతడు ఒకటేవినుమా

56 సకలకర్మలు చేయు నరుడు నన్ను శరణము పొందపార్థా
నాశమెరుగని నిత్యమైన, మోక్షపదమును పొందు
చుండెను

67 సంకల్పమందన కర్మల కర్మగాను యొనగివాడు
ధ్యాసన
స్థిరపుచిత్తము నొంది సన్యాసా సన్న చే బుద్ధి
కొందును

58 కనుక పార్థా నీదు చిత్తము నాయందు
నిల్పియుంచుము
సకల అడ్డులు తొలగునీకు, వాటి ధించ నాశమౌదువు!

59 వ్యర్థహంకరింపుమాని, యుద్ధమిం చేయకున్న
వ్యర్థమయ్యా నీదు జన్మ, నీదు ధర్మమే చేయుయుద్ధం

60, అజ్ఞానమందున నియతకర్మ, చేయనిచ్ఛగించలేని
కర్మ ధర్మము పరవశమున నిన్ను నిన్ను యుద్ధభూమిన

61 యంత్రరూపౌ సర్వప్రాణుల హృదుల నిలచి ఈశ్వరుండు
తనదు మాయన కాలచక్రము, త్రిప్పు చుండుట నీవు
ఎఱుగుము

62 సకల భావము బుద్ధినొంది, హృదయమునగల ఈశ్వరుణ్ణి
ఆశ్రయించ శాశ్వతమాత్మ, శ్రేష్ఠస్థానము కలుగు నీకు

3 జ్ఞానమందున శ్రేష్ఠమైన, పరమగుహ్య మనేకు
దానిని
చెప్పియుంటిని పార్థ! నీకు, చిత్తనచ్చినరీతి నడువుము

4 నాకు మిగుల ఇష్టుడనచు, నీదు శ్రేయము కోరి నేను
శ్రేష్ఠమూర్తుమైనత మెరుగని, దివ్యజ్ఞానము తెల్పు
చుంటిని

65 ఏమమనమున నన్ను నిల్పి, నాదు సేవలు భక్తుడవగ,
కుంతిపుత్రా సలుప నీవు, నన్ను పొందుట
సత్యమయ్యా!

66 సర్వధర్మము వీడి నీవు, నన్నె శరణము పొందుమయ్యా
సకల పాపము తొలగచేసి, మోక్షమొసగెద
శోకమూను ము

67 నేను నీకు చెప్పినట్టి ఇట్టి గీతను తపశ్శీలురు
తపశ్శాలురు, భక్తవర్యులు, కాని వారికి
చెప్పకూడదు!

68 ఇట్టి శ్రేష్ఠ గీతనెవరు, నాదుభక్తులు వినగ తెల్పునో
అట్టి భక్తుడు తప్పకుండా, నన్ను చేరని పార్థా!
వినుము!!

69 భక్తవర్యుల కిట్టిగీత, తెలియచేసెడు నరునికన్న
ప్రియుడు ఎక్కడలేడు పార్థా! వుండబోడు
ముందు కూడ!!

70 "ధర్మసాధన" మనెడు మనదు, వాదనమ్ముల
చదువువాడు
జ్ఞానయజ్ఞము చేసినటుల, నాదు సేవను చేయుచుండె!

71 అసూయ వీడి శ్రద్ధతోడ నిట్టిగీతను వినెడు నరుడు
విడి పాపము, పుణ్యలోకము పొందునయ్యా పార్థా!
వినుము!!

72 పార్థా! నీవు నిర్మలాత్మన, గీత పూర్తిగ వింటివా!
అజ్ఞానరూప మోహానమ్ము భ్రాంతియంతయు వీడెనా?

73 దేవ, దేవా! కృష్ణమూర్తి! నీకృపన నాదు మోహము
చిత్తభ్రాంతులు వీడెనయ్యా, నీదు ఆజ్ఞను
దాల్తునయ్యా!
74 కౌరవేశ్వర! శ్రేష్ఠతరము, గుహ్యతమమౌ గీతనంతా
పరమయోగ్య "పాండుపుత్రుని" వేడ నేను వింటి
ననుచు
75 వ్యాసుడొసగిన దివ్యశక్తిన శ్రేష్ఠమైన "గీతాభగవతి"
పూర్ణయోగశాస్త్రమంతా, జగద్గురువై కృష్ణమూర్తి
తెల్పుచుండగ వింటిననుచు, సంజయుండు చక్రవర్తికి
తెలిపె గీతా సర్వమంతా, వీనులారా విందుచేయ!
76 కౌరవేశ్వర, "కృష్ణపార్థుల" మధ్య జరిగిన దివ్యవాదము
తలచుకొనిన పులకరించి, ఎంతో సంతస మొందుచుంటి!
77 మహారాజా! దివ్యమగు-నా-విశ్వరూపము హరిని తలువ
సంభ్రమమ్ము కలుగుచుండె, వింతసంతసమొందుచుంటిని
78 యోగమూర్త్యై కృష్ణదేవుడు, ధనుర్ధారా పాండుసుతుడు
ఎచట యుందురో అచట లక్ష్మి, సర్వ ధర్మము
విజయముండు!

○ ○ ○

అనుచు మోక్ష సన్యసంబను దివ్యయోగము దేవదేవుడు
పాండు సుతునకు తెలుపు దానిన, రామకృష్ణుడు
తెనుగు చేసె!

○ ○

ధరనఘనమౌ వోరుగంటి వంశజుండ రామకృష్ణుడ
సువర్చలాంబా ప్రసాదరాయ జేష్ఠపుత్రుడ హనుమభక్తుడ
షిర్డిసాయి శిష్యవరుడ శ్రీకరమ్మా భక్తివరల
ఈశ్వరాజ్ఞగి తెనుగుచేసతి, ఇలనుభక్తులు పాడుకొనగ

"గీతా భగవతి"

— సంపూర్ణము —